# కృతజ్ఞత

నా పుస్తకాలలో "స్వదేశసంస్థానాలు" మొదటిది. తండ్రికి పెద్దబిడ్డ అంటే ప్రేమ యెక్కువ అని అంటారు. అలాగే ఈ పుస్తకం అంటే నాకు ఎంతో అభిమానం.

మొదట చాలా బెదురుతో నేను దీన్ని ప్రకటించాను. కాని, ప్రకటన జరిగిన వెంటనే ప్రజలూ, పత్రికలూ ఇచ్చిన ప్రోత్సాహాన్ని చూస్తే, నా బెదురు తీరింది; ఆత్మవిశ్వాసం ఏర్పడింది. ఇందువల్ల నాకు నా తక్కిన రెండు పుస్తకాలూ ఒకయెత్తు, ఇదొక్కటీ ఒక యెత్తు.

ప్రకటించిన రెండు మూడు నెలలకే ఈ పుస్తకం కాపీలన్నీ కూడా అమ్ముడై పోయాయి. కాని, అనేక కారణాలవల్ల దీన్ని ఇంతవరకు తిరిగి ముద్రించలేదు. ఇప్పుడు ఫెడరేషన్ సమస్య వహించిన ప్రాధాన్యంవల్లను, నవయుగ ప్రచురణాలయం వారి పట్టుదలవల్లను దీన్ని పునర్ముద్రించడం సంభవిస్తున్నది.

ఈనాడే గనక నేను ఈ పుస్తకాన్ని వ్రాసివుంటే తప్పకుండా వ్యావహారిక భాషనే వాడివుండేవాడిని. మంచిచెడ్డలు తెలియని కారణాన మొదట దీన్ని గ్రాంథికంలో వ్రాసివేశాను.

పోనీ, ఈ రెండో ముద్రణలో సవరించుదామా అంటే, అది అతి కష్టసాధ్యమైన పనిలా కనబడింది.

అఖిలభారతసంస్థానప్రజాసంఘాధ్యక్షులు లైన డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్యపంతులుగారి సహాయంవల్ల ఈ ముద్రణంలో చాలా క్రొత్త క్రొత్త విషయాల్ని కలపగలిగాను. ఈ విధంగా నాకు సహాయపడినందుకు డాక్టరుగారికి నా వందనాలు.

డాక్టరుగారు ఈ ముద్రణానికి ప్రత్యేకంగా ఒక పీఠికను కూడా వ్రాసి యిచ్చారు. ఇందుకు వారికి చాలా కృతజ్ఞుణ్ణి.

మొదటి ముద్రణాన్ని ఆదరించినట్టుగానే, ఈ రెండోదాన్ని కూడా ఆంధ్రమహాజనులు ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని ప్రచురించడానికి అంగీకరించిన 'నవయుగ ప్రచురణాలయం' వారికి నావందనాలు.

త్వరలో ఈ పుస్తకాన్ని కన్నడ, తమిళ భాషలలోకి అనువదించి ప్రకటించబోతున్నారని తెలపడానికి సంతసపడుతున్నాను.

మద్రాసు
సెప్టెంబరు '38

— నార్ల.

# సంస్థానాలు: ఫెడరేషన్

డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు
అధ్యక్షులు - అఖిలభారత సంస్థాన ప్రజా మండలి]

## 1

ఇది అద్భుతమైన యుగం. నూరు సంవత్సరాలలో జరగదగిన అభివృద్ధి, పదేళ్ళలో జరుగుతున్నది. పదేళ్ళలో జరగదగింది, రెండు మూడు సంవత్సరాలలో ఇమిడిపోతున్నది. కాకపోతే, రాష్ట్రాలను, సంస్థానాలను ఒకే రాజాంగంలోకి తేవడానికిగాను ఎప్పటికో ఒకప్పటికి భారతదేశంలో తప్పనిసరిగా ఏర్పడవలసిన ఫెడరేషన్ విధానంలో సంస్థానప్రజలకు వుండవలసినహక్కుల్ని గురించి జరిగిన అత్యాశ్చర్యకరమైన అభివృద్ధికి అర్థమే కన బడదు. రెండు సంవత్సరాల క్రితం అఖిలభారత సంస్థానప్రజా సభ కరాచీలో సమావేశమై, సంస్థాన ప్రజలకు వోటింగు హక్కు వుండాలనీ, ఫెడరల్ శాసనసభలలో వారికి సరాసరి ప్రాతినిధ్యం వుండాలనీ, వాక్స్వాతంత్ర్యం, పత్రికా స్వాతం

త్ర్యం, సమావేశ స్వాతంత్ర్యం మొదలైన హక్కులు వుండా లనీ, ఈ హక్కుల్ని కాపాడుకోడానికి అవసరమైతే ఇండియన్ ఫెడరల్ కోర్టుకు వెళ్ళడానికి వీలుండాలనీ తీర్మానించి, వీటిని సాధించడానికి ఒక కార్యక్రమం నిర్ణయించినపుడు లోకులుగాని, అసలు కరాచీసమావేశకర్తలు గాని, రెండు సంవత్సరాల లోపుగా అప్పటిలో విపరీతంగా కనబడిన ఈ కోర్కెలు బ్రిటిష్ ప్రభువుల మన్నన పొందుతా యని అనుకోలేదు. 1936 ఏప్రిల్‌లో పైన చెప్పిన విషయాల్ని భారతజాతీయ మహాసభ లక్నో సమావేశంలో ప్రతిపాదించి, చర్చ జరపడానికి యత్నించి నపుడు ఈ కొత్త భావాలపట్ల విశేషమైన ప్రాతికూల్యాన్ని చూపించారు. కరాచీ సమావేశం అయిన తర్వాత మేము దక్షిణ మహారాష్ట్రానికి చెందిన ఇరవై రెండు సంస్థానాలలోను కథియవాడ్‌కు చెందిన పదిహేను సంస్థానాలలోను, తిరువా న్కూరు, కొచ్చిన్, మైసూర్ సంస్థానాలలోను పర్యటన చేశాము. ఇలా పర్యటన చేసిన తర్వాత నవసారిలో సంస్థాన ప్రజాసంఘాల కన్వెన్షన్ జరిపేసరికి, రెండు సంవత్సరాలలో ఇంత ప్రబోధం ఎలా జరిగిందా అనే ఆశ్చర్యం కలిగింది. ఒరిస్సా రాష్ట్రంలోని సంస్థానాలు— అసలు ఆరాష్ట్రమే ఏమంత అభివృద్ధి చెందింది కాకపోయినప్పటికీ— రాష్ట్రీయ సమావేశాన్ని జరిపాయి. పంజాబ్ సంస్థానాలు కూడా ఇలాగే ఒక సమావేశాన్ని జరిపాయి. ఇక, దక్షిణ మహారాష్ట్ర సంస్థా నాలు రెండు సమావేశాల్ని జరిపాయి. మొదటి దానికి

...రిమన్ అధ్యక్షుడు. రెండోది మొన్న మొన్ననే— 1938 మే 22 వ తేదీనాడు— వల్లభాయ్ పటేల్ అధ్యక్షత కింద జరిగింది. కాంగ్రెసు, సంస్థానాలు అనే భిన్నవర్గాల్ని ఏకం చెయ్యడానికి నవసారీలో ప్రారంభమై, హరిపురంలో ఫలప్రదమైన వుద్యమవ్యాప్తికి సర్దార్ వల్లభాయ్ పటేల్ దక్షిణ మహారాష్ట్ర సంస్థాన ప్రజాసభకు అధ్యక్షత వహించడం ఎంతైనా తోడ్పడింది. ఇప్పుడు కాంగ్రెసుకు, సంస్థానాలకు మధ్య విరోధభావం లేదు; అవి పరస్పరం విమర్శించుకోవడం లేదు. ఈ సంఘటనలతర్వాత జరిగిన మైసూరు వుదంతంవల్ల రెండు విషయాలు నిరూపితమౌతున్నాయి. వీటిలో మొదటిదేమంటే,— సంస్థాన ప్రజల భవిష్యత్తు చాలవరకు వారి స్వయంకృషి మీదనే ఆధారపడివుంది. ఇక రెండవ విషయం ఏమంటే,— తమ సంస్థానానికి సంబంధించిన వ్యవహారాల్ని పరిష్కరించుకోడానికి అదును కనిపెట్టి సంస్థానప్రజలు కాంగ్రెసు పేరు ప్రతిష్ఠల్ని వినియోగించుకోవచ్చును.

## 2

ముఖ్యమైన రెండు ఫలితాల్ని మేము సాధించ గలిగాము. వీటిలో మొదటిది ఇది: సంస్థాన సమస్యలంటే ఇప్పటిలా కాకుండా యెక్కువగాను, వెంటనేను శ్రద్ధ చూపించాలనే విషయాన్ని కాంగ్రెసుకు నచ్చజెప్పాము. కాంగ్రెసు అధినాథుడు, కాంగ్రెసుకు మార్గదర్శి అయిన మహాత్ముడు సంస్థా

నాల సమస్యాప్రాధాన్యాన్ని గుర్తించినవాడు, ఇక జరగవలసిన పని అతిసులభమైనదే! భారతదేశ పరిస్థితుల్ని స్వయంగా తెలుసుకోడానికి లోథియన్ ప్రభువు వచ్చాడు. ఇక్కడికి వచ్చినతర్వాత రాజ్యాంగ విషయాల్ని గురించి తనకుగల అపార పరిజ్ఞానం వల్ల ఫెడరల్ శాసనసభలో సంస్థానప్రజలకు సరాసరి ప్రాతినిధ్యం లేకపోతే ఫెడరేషన్ హాస్యాస్పదంగా పరిణమిస్తుందనే విషయాన్ని గ్రహించడానికి ఆయనకు ఎంతో కాలం పట్టలేదు. భారత రాజకీయవేత్తల కోర్కెల్ని సంతృప్తి పరచడానికిగాను బ్రిటిష్ పార్లమెంటు ఇండియా చట్టాన్ని మార్చడానికి సుముఖంగా లేదని చెబుతో, సంస్థానప్రజల కోర్కెల్ని సంతృప్తి పరచడానికి ఏదో ఒక ప్రయత్నాన్ని చేయక తప్పదని ఆయన అంగీకరించక తప్పిందికాదు. లోథియన్ ప్రభువు తర్వాత సామ్యూల్ ప్రభువు ఇక్కడికి వచ్చాడు. ఈయనకూడా లోథియన్ చూపినంతటి శ్రద్ధతో—లోథియన్ కంటె ఎక్కువ తీరుబడిగా కూడా—భారత సమస్యల్ని పరిశీలించి, కేంద్రశాసన సభలో సంస్థానప్రజలకు (సంస్థానాధిపతుల ద్వారా కాకుండా) సరాసరి ప్రాతినిధ్యం వుండాలనే నిర్ణయానికి వచ్చాడు. 1938 మేనెల 28 వ తేదీనాడు ఇండియా శెక్రిటరీ జెట్లండ్ ప్రభువు వుపన్యసించాడు. ఆ ఉపన్యాసంలో అసంతృప్తికరమైన విషయాలు ఏమి వున్నప్పటికీ, సంస్థానప్రజల కోర్కెల్ని ఇండియాచట్టాన్ని మించిపోకుండానే సంతృప్తి పరచడానికి అవకాశాలు లేకపోలేద

అశను ఆయన ప్రకటించాడు. దాని అర్థం ఏమంటే, సంస్థానాలు ఫెడరేషన్‌లో చేరడానికి ముందు మన్నించవలసిన షరతులలో (Instrument of Association) లోనే సంస్థానాధిపతులు ఫెడరల్ శాసనసభలకు ప్రతినిధుల్ని పంపించడంలో తమకుగల అధికారాల్ని తమ ప్రజలకుకూడా పంచిపెట్టాలనే నియమం వుంటుంది. దీన్నే ఇంకొక విధంగాకూడా చెప్పవచ్చు. బహుశా ఫెడరల్ అసెంబ్లీ (Lower House) ప్రతినిధుల్ని సంస్థానప్రజలు ఎన్నుకోవాలనీ, ఫెడరల్ కౌన్సిల్ (Upper House) ప్రతినిధుల్ని సంస్థానాధిపతులు నామినేట్ చెయ్యవచ్చుననీ, నియమం చేస్తారు. ఈవిధంగా రెండు సంవత్సరాల లోపుగా సంస్థానాలలో ఎంతో అధికంగా ప్రచారం సాగించడం వల్లనూ, కాంగ్రెసుసంస్థకు ఎడతెగకుండా వొత్తిడిపెట్టడం వల్లనూ,— ఈపని చేసింది విరోధభావంలో కాదు; స్నేహపాత్రంగానే— భారత రాజకీయాలలో సంస్థానప్రజల సమస్యకు ప్రాధాన్యాన్ని తేవడమే కాకుండా, వీరికోర్కెలకు ఆమోదాన్ని సంపాయించడంకూడా సాధ్యమైంది.

## 3

బాధ్యతాయుత పరిపాలనకోసం మైసూరులో జరిగిన ఆందోళననుగురించి ఇంతకుముందు పేర్కొన్నాము. ఈ ఆందోళన సందర్భంలో జరిగిన సంఘటనలను గురించి ఆ సంస్థానప్రజలు సిగ్గుపడవలసింది ఏమీలేదు; ఆసంస్థానంవారు గర్వపడదగిందీ లేదు.

ఏదిజరిగితేనేమిగాని, చివరికి వొడంబడిక కుదిరింది. రానున్న ఒకటి రెండుసంవత్సరాలలో మైసూరులోజరిగే అభివృద్ధి తక్కిన సంస్థానాధిపతులకు తాము అవలంబించవలసినమార్గాన్ని తెలపడమే కాకుండా, "వార్నింగ్" గా కూడా వుపకరించవచ్చు.

తిరువాన్కూరు సంస్థానం మైసూరును కలుసుకోడానికి సిద్ధంగా వుంది. నిజానికి మైసూరు రాజ్యాంగ విధానంకంటె తిరువాన్కూరు రాజ్యాంగ విధానమే ఉత్తమమైంది. అంచేత మైసూరు కంటె తిరువాన్కూరు ముందుఅడుగు వేస్తుందని ఆశించాము గాని, అది వెనకబడింది. అక్కడ జాతీయత ఇంకా పరిపక్వం కావలసివుంది కాబోలు !

కొచ్చిన్ సంస్థానప్రజలలో కూడా ఇంతటి కాంగ్రెసు భక్తి వున్నది. ఆ సంస్థానపు దివాను ముందుగానే మేలుకుని, కొంత వరకు బాధ్యతాయుత పరిపాలనను ప్రవేశపెట్టడమే కాకుండా, చేసిన వాగ్దానాలు చెల్లుబడికే ప్రజలు ఎన్నుకున్న మంత్రిని కూడా నియమించాడు.

రాజ్యాంగసంస్కరణలను గురించి విచారించడానికి పాటియాలా సంస్థానం ఒక కమీషన్ను ఏర్పాటు చేసింది. కపుర్థలలో కూడా ఇదే ఏర్పాటు జరిగింది. ఒకప్పుడు బరోడా అభివృద్ధికి మార్గదర్శిని అంటుందిగాని, ఇప్పుడది వెనకబడిపోయింది. మంచి పేరును సంపాయించుకున్న భోపాల్ చకచక చెడ్డపేరు తెచ్చుకుంటున్నది. ప్రజోద్యమాలను, ప్రజాస్వామిక సిద్ధాంతాలను ప్రోత్సహించినందులకుగాను అక్కడ పత్రికలపై ఆంక్షల్ని

వేస్తున్నారు; నిర్బంధ శాసనాలను అమలు పరుస్తున్నారు. స్థానికపు ప్రసిద్ధ పత్రికలు ఈ నీతికి బలిఅయిపోయినాయి. ఎప్పటికప్పుడు అడుగుతూన్న హెచ్చు సెక్యూరిటీ మొత్తాలను కట్టలేక పోయినందువల్ల గడచిన మూడు సంవత్సరాలలోపు ననే అనేక ముద్రణయంత్రాలయాలను కట్టివెయ్యవలసి వచ్చింది. అభివృద్ధికి దోహదమిచ్చే సారస్వతాన్ని స్థానికంగా ముద్రించుకోడానికిగాని, బయటనుంచి తెప్పించుకోడానికిగాని ప్రజలకు వీలులేకుండాపోయింది. సంస్థానంలోని ప్రతి పోస్టు జవాను కూడా సి. ఐ. డి. వారి చెప్పుచేతలలోనివాడే నట. ఏ కొంచెం అనుమానం తోచినప్పటికీ ఉత్తరాన్నిగాని, బుక్ పోస్టుగాని, పార్శెల్ గాని జప్తు అయిపోతుంది. ప్రజల్ని భీతావహుల్ని చెయ్యడానికీ, వారిని పౌరుషహీనుల్ని చెయ్యడానికీ భోపాల్ సంస్థానం యత్నిస్తున్నది. దేవాలయానికిగాని, మసీదుకుగాని నాలుగుమైళ్ళ దూరంలోనైనా సరే— ముందుగా సిటీ మేజస్ట్రేట్ దగ్గరనుంచి లిఖిత పూర్వకమైన అనుజ్ఞను పొందనిదే— సభను జరపడానికి వీలులేదు. ఇక ఈసభ రాజకీయసంబంధమైనదైతే, అనుజ్ఞ రావడం బ్రహ్మప్రళయం. ప్రజోద్యమాలను ప్రోత్సహించే స్వస్థానేతరులు ఎవరైనా సంస్థానానికి రావాలని అనుకుంటే, వారి రాకను నిషేధిస్తున్నారు. ప్రజనుల కొలది వార్తాపత్రికలు ప్రస్తుతం బహిష్కరణ పట్టికలో వున్నాయి. వీటిలో ముఖ్యంగా వినదగింది 'మదీనా' అనే ద్వైవార పత్రిక. దీనికి విశేషప్రచారం వున్నది.

ఇక హైదరాబాదు సంగతి చెప్పనక్కరలేదు. ఇక్కడ ఒకగస్తీ అమలులోవుంది దీనిప్రకారం సంస్థానంలో ఎక్కడ సభ జరప దలచినా, పదిహేను రోజులు ముందుగా నోటీసు ఇవ్వాలి. ఈ నోటీసులో కేవలం సభజరిగే స్థలాన్ని, కాలాన్ని నిర్దేశిస్తే చాలదు. దానిలో జరిగే ఉపన్యాసాలను, దానిలో చర్చించే తీర్మానాలను ముందుగా తెలుపుకోవాలి.

ఇక్కడ హిందూ – మహమ్మదీయ వైషమ్యాలు విపరీతమౌ తున్నవి కూడా! జనాభాలో నూటికి పదిమందిచొప్పున మాత్రమేవున్న మహమ్మదీయులకు, నూటికి యాభై వంతుల ప్రాతినిధ్యాన్ని ఇవ్వడానికి హిందువులు అంగీకరిస్తున్నారు. అయినప్పటికీ, జనాభాలో నూటికి తొంభై వంతుల చొప్పున వున్న హిందువులకు సంస్థానోద్యోగాలలో నూటికి యాభై వంతుల్ని ఇవ్వడానికి మహమ్మదీయులు సమ్మతించడంలేదు. ఇలా అన్నివిధాల ఒక సంఘానికే లాభం జరగాలనడం తగదు. స్వమతం అంటే గాఢాభిమానంగల పరిపాలకుడు నైజాం. అయినా, దీనివల్ల బాధలేదు. అసలుచిక్కు పరసపెట్టి ఇస్లాం మతం ఇప్పించడంలోనే వస్తున్నది. హైదరాబాదులో రోషాలు పెరుగుతున్నవి. మైసూరులో మాదిరిగా ఇక్కడకూడా పెద్ద తుపానురేగితే, మనం ఆశ్చర్యపడనక్కరలేదు (ఇప్పుడిప్పుడే రేగుతుంది). హైదరాబాదులో రాజకీయ పరిస్థితులు మత, సాం

ఘిక సమస్యలవల్ల మరింతక్లిష్టంకావడం సంతాపకరమైన విషయం. ప్రజలు ఈనుత, సాంఘిక సమస్యలను వీలైనంతవరకు తోసి పుచ్చుతారనే హృదయపూర్వకంగా ఆశిస్తున్నాము.

## 5

నరేంద్రమండలి అధ్యక్షపదవిని అలంకరించిన పాటియాలా మహారాజు కాలధర్మాన్ని పొందాడు. కొత్త మహారాజు సింహాసనాన్ని ఎక్కడంతోపాటు ప్రజల పౌరసత్వపుహక్కులు ఆమోదాన్ని పొందగలవని కూడా ఆశపడుతున్నాము. తన సంస్థానప్రజలలో ఎంతటి హీనస్థితిలోనివాడైనా సరే తనకష్ట సుఖాలను నివేదించుకోడానికి నిరభ్యంతరంగా సరాసరి తనవద్దకు రావచ్చునని కొత్తమహారాజు అన్నాడట. ఇది సంతోషకరమైన విషయం.

ఇటీవల కాష్మీర్‌లో పెద్దతుపాను రేగింది. హైదరాబాదులో పరిస్థితికి కాష్మీర్ పరిస్థితి సరిగా తలకిందులు. ఇక్కడ మనం ముఖ్యంగా ఒక విషయాన్ని గుర్తించుకోవాలి. ప్రజాప్రభుత్వాన్ని సంస్థాపించడానికి బ్రిటిష్ ఇండియాగాని, ముందంజ వేసే సంస్థానాలుగాని పడిన పాట్లను ప్రతి వొక్క సంస్థానం పడవలసిన అవసరంలేదు. బ్రిటిష్ ఇండియాలో యాభై సంవత్సరాల ఆందోళన తర్వాత సహాయనిరాకరణంతో ప్రారంభమై, సత్యాగ్రహంతోనూ, శిస్తుల్ని చెల్లించక పోవడంతోనూ

పూర్తిఅయిన ఒక కొత్త విధానాన్ని మనం కనిపెట్టినాము. ప్రజాందోళనలో బ్రిటిష్ ఇండియా ప్రజలు ఎక్కడికి వచ్చి ఆగిపోయినారో, సరిగా అక్కడనుంచి మైసూరు సంస్థానం వారేమి, మైసూరు ప్రజలేమి ముందుకు సాగిపోయారు. ఇది జరిగినకథ తిరిగి జరగడంకాదు. కథ ఒక్కొక్క ఘట్టంచొప్పున ముందుకు నడవడం!

మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిన్, బరోడా: ఇవి ఇంకా ముందంజలోనే వున్నవి. పాటియాలా వీటిని అనుకరిస్తుంది. హైదరాబాదు, నాభా, కపుర్థల, గ్వాలియర్, ఇందూర్ మొదలైన పెద్దసంస్థానాలు తమ ప్రజలకు పౌరసత్వపు హక్కుల్ని ఇచ్చి, బాధ్యతాయుత పరిపాలనను ప్రవేశపెడతవి ప్రజాభీష్టానికి లోనైవుండే నిజమైన ఫెడరేషన్, ఏర్పాటు కావాలంటే, ఇది జరగడం అవసరం!

## 6

మహారాణా యాజమాన్యంక్రింద బాధ్యతాయుత ప్రజాపరిపాలనను ప్రవేశపెట్టించాలనే వుద్దేశంతో బయల్దేరిన మేవాడ్ ప్రజామండలిని ఉదయపూర్ సంస్థానంలో నిషేధించినట్లు ఉత్తరహిందూస్థానపు పత్రికలద్వారా ఇటీవలనే తెలియ వచ్చింది. ప్రజామండలి కార్యదర్శిని సంస్థానంనుంచి వెళ్ళిపొమ్మన్నారు.

ఈ నిరంకుశచర్య ప్రజలలో చాల అశాంతిని కలగజేసిందని ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ఉదయపూర్ దర్బార్ వారి ఉత్తరువును భారతదేశంలోని ప్రతి నాగరికవ్యక్తియు అసహ్యించుకొనవలసినటువంటివి. తక్కిన సంస్థానాలలో బాధ్యతాయుత పరిపాలన కాకపోయినప్పటికీ కనీసం ప్రజాప్రాతినిధ్యం గల శాసనసభల నిర్మాణానికి కృషిజరుగుతూవుండగా, ఉదయపూర్ లాంటి సంస్థానము ఈ కుమార్గాన్ని తొక్కడం శోచనీయం.

## 7

ఉత్తమమైన హైదరాబాదు సంస్థానంలో గల లోపాలు పూర్తిగా తెలియనివారు ఆంధ్రదేశంలో లేరనే చెప్పవచ్చును. నైజాం ప్రస్తుత పరిపాలనవిధానంలో కొన్ని మంచి విషయాలు లేకపోలేదు కాని, ఈ విధానం ప్రజల పౌరసత్వపు హక్కుల్ని, ఇతర ప్రాథమిక హక్కుల్ని హరిస్తున్నది. హైదరాబాదు స్వాతంత్ర్యాన్ని సంపాయించుకుంటే, ఆ మరు క్షణంలో మిగిలిన భారతదేశం స్వాతంత్ర్యాన్ని పొందినట్టే! అందుచేత భారత సంస్థానాలు అన్నిటిలోనూ పెద్దదైన ఈ సంస్థానంలో అధిక సంఖ్యాకులుగా వున్న మన తెలుగువారికి రాజకీయ పరిజ్ఞానాన్ని కలిగించడం మన విధి. ఈకారణాన ఈ పుస్తక ప్రచురణం ఎంతైనా సమంజసంగాను, సమయోచితంగానువున్నది. కేవలం

వివిధ రాష్ట్రాలనే కాకుండా, సంస్థానాలను, సంస్థాన ప్రజలను దరిజేరదీయగల ఫెడరేషన్ వైపుకు ఈ పుస్తకము ప్రజల ఆలోచనలను మరల్చగలదని ఆశిస్తున్నాను. ముఖ్యంగా హైదరాబాదు సంస్థానంలోని తెలుగువారిలో ఈపుస్తకాన్ని ప్రచారంలోకి తేవాలని చెబుతో, సర్వత్రా ఇది ప్రజాదరణాన్ని పొందగలదని నమ్ముతున్నాను.

# ఉపక్రమణిక

భారతవర్ష చరిత్రలో ఇది కడు సందిగ్ధావస్థ. ఆర్థిక, సాంఘిక, రాజకీయాది సమస్యలెన్నో నేడు మనల నెదుర్కొనుచున్నవి. వీని నెల్ల మనము సక్రమముగ పరిష్కరింప గలిగినచో, భారత భూమి అభ్యున్నతపథముల మెట్టుచు, సర్వప్రపంచమునకు ఆదర్శ ప్రాయమై వెలయుగలదు. లేనిచో, ఇప్పటివలెనే పడి యుండును— నిర్వీర్యముగ, నిస్తేజముగ, నిర్జీవముగ...

ఇట్టి సమస్యలలో స్వదేశ సంస్థానములనుగూర్చిన దొకటి. ఐనను దీనినిగూర్చి తగిన శ్రద్ధ లేకుండుట సంతాపకరము! కేవలము సంతాపకరమే కాదు;—ఆత్మహత్యాసదృశము కూడ! అఖిల భారతవర్ష విస్తీర్ణములో మూడవ వంతు స్వదేశ సంస్థానములు! యావద్భారత సంతతిలో ఐదవవంతు సంస్థాన ప్రజలు! ఇట్టియెడ స్వదేశసంస్థానసమస్య ప్రాధాన్యమును ఎవరు కాదనగలరు?

హైదరాబాదు సంస్థానము వైశాల్యమున ఇటలీ దేశముతో సరిపోలును. మైసూరు ఇంగ్లెండునకు కుడియెడమగ నుండును.

బికనీరు గ్రీసు దరిదాపులకు వచ్చును. జయపూరు స్విట్జ ర్లాండునకు తీసిపోదు. రీవా బెల్జియముకన్న పెద్దది.

కాని, ఇట్టి విషయములను గమనించువా రెవరు? భారత జాతీయాశయములకు ప్రతిరూప మనదగు కాంగ్రెసు మహా సంస్థయే స్వదేశసంస్థాన సమస్యనుగూర్చి తగిన శ్రద్ధవహిం చుట లేదు.

పూర్వ మొకప్పుడు హిందూ మహమ్మదీయులు పరస్పర విద్వేషముల విస్మరించి స్వాతంత్ర్యప్రాప్తికై కృషిసల్ప, మరా వేశమున కన్నుగానక శిక్కులు తత్సిద్ధికి అడ్డుపడిరి. తదుపరి మహమ్మదీయులే స్వార్థచింతాతత్పరులై స్వరాజ్యలబ్ధికి ప్రతి బంధకులైరి. భారత భావిభాగ్యోదయమున కిక ముందు స్వదేశ సంస్థానములు అడ్డుతగుల వఱసియున్నవి కాబోలును. కానిచో, స్వదేశసంస్థాన సమస్యాపరిష్కారమును గూర్చి ఇంత అశ్రద్ధ యుండెడిదా? ఏడుకోట్ల స్వదేశ సంస్థాన సంతతి ఘోరదుర్దశ పట్ల ఇట్టి మూకీభావ ముండెడిదా? స్వదేశసంస్థానాధీశుల విపరీత విశృంఖలవర్తనలయెడ ఇట్టి తాటస్థ్య ముండెడిదా?

దీని నంతయు చూచినప్పుడు భారతభూమి కష్టము లింతటితో దీరవని హృదయము పరితపించుచుండును. కాని, ఆశాలేశము లేకపోలేదు. సంస్థానప్రజలే నేడు సంఘీభావమును పెంపొందించు కొనుచు, స్వీయస్వాతంత్ర్యసిద్ధికై కృషిసలుపుచున్నారు. నిర్బం

ధము లెన్ని యున్నను అనేక సంస్థానములలో ప్రజాసంస్థలు ఏర్పడుచుండుటయే ఇందుకు నిదర్శనము.

సంస్థానప్రజల ఆందోళనములో మనము పాల్గొన లేకపోయిన, పోవచ్చును. కాని, వారి ఆకాంక్షల యెడ సానుభూతిని వెల్లడించుట సంస్థానేతరభారతీయుల మగు మన సామాన్య ధర్మము. దీనినిగూడ నిర్వర్తింప లేకపోయినచో మనము స్వరాజ్యమునకు అనర్హులమని చెప్పక తప్పదు.

ఈ సామాన్య ధర్మనిర్వహణ ప్రబోధమునకే నే నీ గ్రంథరచనకు పూనుకొంటిని. దీనిని చదివి ఒక్కసంస్థానేతర భారతీయుడైనను "మన పొరుగుననే సోదర దేశీయులు ఇన్ని యిడుములు గుడుచుచున్నారా?" అని పరితాపతప్తహృదయు డగునేని నేను కృతకృత్యుడనైతిననియే భావింతును.

ఇక, సంస్థానప్రజలలో ఒక్కడేని దీనిని గాంచి "మన దుర్భరావస్థలయెడ సానుభూతిగలవారు లేకపోలే"దని గుండె దిటవు పరచుకొనినచో, నా సంతోషాతిశయమునకు, నా ఆనందాతిరేకమునకు, నా...

శాలు వచ్చిన పిదపగూడ అతనిని గడపదాటనీయరు. ఎల్లప్పు డును తల్లియే యతనిని చంకనెత్తుకొని తిరుగుచుండును; లేదా పరమవిశ్వాసపాత్రురా లగు దాసిచేతి కిచ్చును. ఆ దాసియు అతనిని "తండ్రీ" అనియు, "ప్రభూ" అనియు, "దేవా" అనియు సంబోధించుచు, విపరీతమగు భయభక్తులను ప్రద ర్శించుచుండును. ఈ పదముల అర్థజ్ఞాన ముదయించినప్పుడు వానివలన అతనికి గలుగు భావోన్మేషణ మేమి? తాను అపర దైవతము ననియే కాదా! అతని ఆటపాటలకుగూడ దాసదాసీ జనుల బిడ్డలనే సమకూర్తురు. అతడు తిట్టినను, కొట్టినను, పడ దన్నినను వారు పొరపాటుననైన నోరెత్తరు. నోరెత్తి, వారు బ్రదుకగలరా? ఇక, అతనికి బాల్యముననే నిరంకుశాధికార ప్రేమయు, మానవ సమభావశూన్యతయు అబ్బుటలో ఆశ్చర్య మేమి?

ఏడవయేట అతనిని పాఠశాలలో ప్రవేశపెట్టుదురు. సాధారణ పాఠశాలలో అని భ్రమింతురేమో! కాదు!! అనస్తంగత సూర్యసామ్రాజ్యమునకు భావికాలమునందు అధిపతి యగు వాడే బ్రిటీష్‌పౌరులతోబాటు ఆక్సుఫర్డులోనో, కేంబ్రిడ్జిలోనో చదువుకొనును. కాని, మనవారి కిది తగదు! వేల్సు యువ రాజు పద్ధతినే అనుకరించినచో, మరి వీరి ప్రత్యేకత యేమి?

ఇట్టి ప్రత్యేకపాఠశాలలు— పొరపాటు!— కళాశాలలు నాలుగు కలవు. ఇక్కడ అన్ని విషయములను నేర్పుదురు,—

# మహారాజులు

పరిపాలకుని జీవనక్రమమును అనుసరించియే ఆతని పరిపాలనా విధాన ముండును. ఇందుచే స్వదేశ సంస్థానముల పరిపాలనా పద్ధతిని పర్యాలోచించుపట్టున తత్పాలకుల జీవిత విధానములను వర్ణించుట అసందర్భము కానేరదు.

సంస్థానాధీశుని లేబ్రాయమంతయు పరిపూర్ణముగ అంతఃపురములలోనే గడచును. అతనికి సర్వసామాన్యముగ పెక్కుమంది సవతితల్లు లుందురు. వారి ఈర్ష్యానలమునకు ఆత డెక్కడ ఆహుతి యగునో యను భయముచే ఆతనిని కంటిని రెప్పవోలె గాచుచుందురు. ఈ భయము నిరాధారమైనది కాదుకూడ ! పట్టమహిషీగర్భమున బుట్టినారను వ్యాజమున అప్పుడప్పుడు కొందరు రాకుమారులు సవతితల్లులచే దారుణముగ హత్య గావింపబడిరి; కావింపబడుచున్నారు. కాని, సరియగు నిదర్శనము లేకుండుటచే ఇట్టి విషయములు బయల్పడవు. సంస్థానాధీశుల జీవన నవనవోదయవికాసావసరములందే ఇట్టి విషవాతావరణము ఆవరించుచున్నప్పుడు వారి కెట్లు లభింపగలదు— సచ్చరిత్రమును, సన్మార్గవర్తనమును ?

స్థానాధీశులు మున్ముందుగ వీనిలోనే త్యాగుడును నేర్చుకొం దురు. స్వదేశ సంస్థాన సమస్యను సంపూర్ణముగ నెఱిగిన చూడ్లర్ వీనినిగూర్చి యిట్లు వ్రాసెను:

"ఈ రాకుమార కళాశాలలు సాధారణముగ దురాచారము నకును, దుర్నడతకును మూలకందములు!"

ఇవి యిట్లు నిరుపయోగములేగాక హానికరములైనను, ఖర్చునకు మాత్రము కొదువ లేదు. ఒక్కొక్క కళాశాలకు సాలీనా నాలుగు లక్షల రూప్యములకుపైగా వ్యయమగును. పైగా, ఒక్కొక్కదానిలో విద్యార్థులసంఖ్య యేబది మాత్రమే!

ఇటీవల రాకుమారులను విద్యాభ్యాసమునకై పాశ్చాత్యదేశము లకు— అందు ముఖ్యముగ ఇంగ్లండునకు— పంపుట వరిపాటి యైనది. దీనివలన మఱింత నష్టము గలుగుచున్నది. ఈమధ్యనే ఒక రాకుమారుడు విద్యాసముపార్జనమునకై ఇంగ్లండువెళ్ళెను. అక్కడ వరుసగ మూడువత్సరములు పరీక్షలన్నిటిలో దప్పెను సరిగదా, త్రాగుడును కూడ నేర్చుకొనెను. అంతదూరము శ్రమపడి వెళ్ళినందులకు కనీసము త్రాగుడువిద్యయైన నేర్చు కొనకపోవుట తప్పుగా అతడు భావించి యుండనోవు! తుదకు ఆ బాలుని స్వదేశమునకు తీసికొనివచ్చుటకై భారతదేశము నుండి ప్రత్యేకముగ నొకరు ప్రయాణము కట్టవలసి వచ్చెను. మఱొక రాకుమారుడు ఇట్లే విద్యానిమిత్తము విదేశముల కేగెను. అతనికి విద్య అబ్బలేదు గాని, సుఖసంకటము లంటెను.

వానితో బాధపడుచు అత డొక హోటలులో మరణించెను. "అయ్యో! పాపము!!" అను దిక్కు కూడ అచట లేకపోయెను!

ఇట్లు విద్య (అవిద్య) ముగిసిన పిమ్మట రాకుమారుని యౌవ రాజ్యపట్టాభిషిక్తుని గావింతురు. అటు పిమ్మట వివాహ...

కొద్దిలో వివాహమునుగూర్చి ముగించుటకు వీలులేదు. దానికి ప్రత్యేకముగ ఒక ప్రకరణము కావలసినదే!

# వి వా హ ము

ఈ ప్రకరణమునకు "వివాహము" అను శీర్షిక నుంచితిని. ఇది పొరపాటు; "వివాహములు" అనుట యెక్కుడు సమంజసము, — సత్యముకూడ! హేతువు: సంస్థానాధీశులలో అధిక సంఖ్యాకులకు కనీసము నాలుగైదు పెండ్లిండ్లు అగుటయే! దీనినిగూర్చి మున్ముందు సవిస్తరముగ తెలియజేతును.

పరిణయమహోత్సవమునకు కొన్ని మాసముల పూర్వము నుండియు ప్రయత్నములు ప్రారంభ మగును. కార్మికులు, కృషికులు, వణిజులు, వేయేల! ఆబాలగోపాలమును ఈ ప్రయత్నములలో పాల్గొన వలసినదే! లేని-చో దూషణ, దండన, కారాగారవాసము...

పెండ్లిప్రయత్నములలో పాల్గొనినందులకు ప్రతిఫల మేమి? పనిచేసి నన్ని రోజులును పొట్ట కింత కూడు! ఇంతటితో సరి పోయిన నదియే పదివేలు! కాని, "సుబ్బిపెండ్లి, వెంకిచావునకు వచ్చిన" దన్నట్లు యింతటితో సరిపోదు. ప్రజలు స్వయముగ కాయకష్ట మొనర్చుటయేగాక, తమబండ్లను, ఎడ్లను సంస్థానోపయోగార్థ మీయవలెను. ఒకొక్కప్పుడు చెంబును,

చేతాడ్రిదును కూడ ఇచ్చివేయవలెను. పైగా, ఏడుకొండల వాని ముడుపువలె వివాహసుంకమును సయితము సమర్పించుకొనవలెను.

ఈ ప్రయత్నములు ఆరంభమైనప్పుడే న్యాయస్థానములు, పాఠశాలలు, ప్రభుత్వకార్యాలయములు మొదలుగాగల వన్నియు కట్టివేయుదురు. దివాను మొదలు, బిళ్ళబంట్రోతు వఱకు సంస్థానోద్యోగు లందరును పెండ్లిపనులలోనే మునిగిపోదురు.

బ్రహ్మాండముగ నిట్లు ప్రయత్నములు ముగిసినపిదప వివాహము జరుగును. వివాహములలో రెండు విధములు కలవు. మొదటిది: రాకుమారుడు స్వయముగ తరలివెళ్ళి పరిణయమందుట. రెండవది: తన బదులు తన కత్తిని పంపుట— "ఈకత్తితోనే మున్ముందు నీగొంతు కోసెదను" అనుటకిది సాంకేతికము కాబోలు!

వివాహసందర్భమున జరుగు వైభవమును వర్ణింప బ్రహ్మకైనను తరము కాదు. ఆ మేళతాళములు, ఆ వారాంగనానృత్యగీతాదివినోదములు, ఆ బాణసంచాప్రదర్శనములు, ఆ విందులు, ఆ వేడుకలు...

ప్రజల రక్తమాంసములను పిండితెచ్చిన ధన మున్నదిగదా తగులవేయుటకు! ఇక వైభవముల కేమి కొఱత?

పరిణయమైన పదియవనాటికే రాకుమారునికి ప్రథమకళత్రము పాత యగును. అప్పుడు తిరిగి బ్రహ్మాండములగు వివాహ

ప్రయత్నములు— తిరిగి నిరుపమాన వైభవోజ్జ్వలత— తిరిగి దారుణ దుర్వ్యయము...

నూతనవధువు ఆగమనముతో మొదటిభార్య జీవితము దుర్భరమై పోవును. ఆమె దిక్కు-మ్రొక్కులను అరయువా రుండరు. జీవచ్ఛవమువలె ఆమె రాజాంతఃపురములో ఒకమూల బడి యుండును. ఆమె కష్టము లిక దీరునది మృత్యుదేవత ప్రసన్నమైననాడే! పిమ్మట ద్వితీయ కళత్రపు ప్రాప్తియు నింతే! ఇట్లే తృతీయ, చతుర్థ, పంచమ,...

ఇట్టి దుస్సహాజీవనముతో విసిగి ఒకప్పు డొక మహారాణి 'బొంబాయి క్రానికల్' పత్రికకు లేఖను వ్రాసినది. కఠిన కర్కశహృదయమునైనను ద్రవింపజేయగల దా లేఖ! దానిలో ప్రతియక్షరమును వేదనాభరమున మూల్గుచున్న ట్లుండును. ఎంత యత్నించినను అనువాదము అనువాదమే! ఈ మహారాణి లేఖనుగూర్చి ఇక వేఱుగ జెప్పనక్కరనే లేదు! ఐనను సాహసించి ఆమె లేఖనుండి కొన్ని భాగములను అనువదింప నే నిట యత్నింతును:

"నా తండ్రి శ్రీమంతుడు కాడు; మఱి సామాన్యుడును కాడు. నాసోదరులతోబాటు నాకుగూడ విద్యాబుద్ధులు గరపిరి. నవనాగరకుల మని నా తండ్రి గర్వపడుచుండెడివాడు. వివాహసమయమున నా భర్తకు మంచి కట్నమునే యిచ్చిరి. బహుశః దానిని నా పోషణనిమిత్తము ఉద్దేశించి యుందురు.

కాని, దానినుండి నా కొక రాగిదమ్మిడి యైనను ముట్టలేదు. ఆ దినములలో నాకు వివాహ మన సరిగ అర్థము కాలేదు. ఆనందదాయక మగు మాతృగృహమును వీడి, అపరిచితుల మధ్య జీవింప నేగుటయే వివాహ మనుకొనుచుంటిని. కాని, నన్ను పరిణయ మగుచున్న రాకుమారుడు ఉత్తమాభిజాత్య సంపన్ను డని గ్రహింపగల ప్రాయము నా కప్పుడు లేకపోలేదు. వైభవముగ జీవింపవచ్చు నని నేను సుఖస్వప్నములగూడ గంటిని *** భర్తృగృహమున నన్ను దయతోనే చూచిరి. వస్త్రాభరణములకుగూడ లోపము లేదు. ఇట్లుండగా ఒక దినమున నాభర్తకు మఱియిద్దరు భార్యలు గలరనియు, వీరుగాక పెక్కుమంది ఉంపుడుగత్తెలు గలరనియు నా చెవిని బడెను. అప్పుడు సిగ్గుతో నేను క్రుంగిపోతిని. తలయెత్తి నా దాసీజనమునైనను జూడ సాహసింపలేకపోతిని. రాకుమారుడు నాయొద్దకు వచ్చినప్పుడు కడుజాగ్రత్తగ అతనితో ఈవిషయమై ముచ్చటించితిని. కాని, అతడు చెవిని బెట్టనే లేదు. పైపెచ్చు విశ్వాసాతీతమైన విషయముల నెన్నిటినో నా కతడు చెప్పెను. మానవు డింతటి పశుప్రాయుడు కాగల డని నే నెన్నడును భావింపలేదు.

"ఏదో వంకబెట్టి నా పుట్టింటికి పోతిని. అక్కడ ఏడ్చితిని; మొత్తుకొంటిని. మా మేనత్త నేను విన్నవానికన్న ఘోరమైన గాథలను నా కప్పుడు చెప్పెను. తిరిగి నే నెట్లో భర్త

వద్ద కేగితిని. సద్వంశమున జన్మించితి నను గర్వము, పవిత్ర గార్హస్థ్య జీవనమును గడుపు చుంటి నను ఆనందము నాలో విలుప్తమయ్యెను. పవిత్రత ఈ రాకుమారులకై యుద్దేశింపబడలేదు. దానికి వా రతీతులు! భర్తృకృపాకటాక్షమే నా జీవనసర్వస్వము. నేడు నేను గొప్పదానిని కావచ్చును. రేపే నేను భిక్షుకురాలిని కావచ్చును. ఖజానా నా అందుబాటులోనే యున్నది. కాని, దానిలో చిల్లిగవ్వైనను నాది కాదు. ఇల్లే దుస్తులు మోటార్లు, గుఱ్ఱములు, నౌకర్లును, * * * కావలయు నని నన్నెన్నో విధముల అవమానించుచున్నారు. ఆత్మగౌరవమునకు రాణ్మందిరాంతర్భాగమున తావు లేదట. అన్ని అవమానములను నేను సణగుచునో, గొణుగుచునో భరించుచున్నాను. నన్ను కేవల మొక బందీగా జూచుచున్నారు. * * * కష్ట సుఖములను జెప్పుకొందమన్నను నాకు దిక్కులేదు.

"మన రాకుమారుల కేమి దుర్బుద్ధి పుట్టినదో భగవంతునికే యెరుక! వీరిలో ఇంతమంది కనుబడినదానివెంట నెల్ల పడుచున్నా రేల? తమపేరు ప్రతిష్ఠలను వీ రంత నిర్లక్ష్యమొనర్చుచున్నా రేల? దేశమంతయు ఉన్నతభావప్రేరితమై స్వీయాభివృద్ధికి కృషిసల్పుచుండ వీ రధోగతిపా లగుచున్నా రేల? వీరిలో నింతమందికి విపరీతవిషయకాంక్ష యున్న దేల? సంస్థానాధీశులలో కొంతమంది విశృంఖలముగ వ్యభిచ

రించు నిమిత్తమే యూరపుఖండమున కేగుచున్నారనుట సువిదితమే! వీరు రాచకార్యములను నిర్లక్ష్య మొనర్చుచున్నారు. ప్రజలకిది కోపకారణముగ నున్నది. కాని, వీరికిది యొక లెక్కా? బ్రిటిషుప్రభుత్వము జోక్యమే కల్గించుకొనుట లేదు. బహుశః ఆత్మవినాశన మొనర్చుకొను నిమిత్తమే వీరికిట్టి స్వాతంత్ర్య మొసగుచున్నారు.

"సంస్థాన ప్రజలలో సంచలనము గలిగినది. వారు తమ కష్టములను మొఱపెట్టుకొనుచున్నారు. వైస్రాయి వారి మొఱ ఆలకించునేమో! కాని, మాగతి యేమి? * * * మేము బానిసలుగ నుండవలసినదేనా? మహారాణికి, ఉంపుడుకత్తెకు భేదమే లేదా? మాకు హక్కులు మృగ్యములేనా? * * * బిచ్చగాండ్రకన్న మాస్థితి అధమము. కేవలము భర్తృచంచల వాంఛలను సంతృప్తిపఱచుటయే మాధర్మ మనుచున్నారు. మా ఆత్మాభిమానము నెల్ల హరించుచున్నారు. మేముగూడ మానవులమే అని వాదించినచో, మమ్ములను దండించుచున్నారు.

"మాజీవితములు శూన్యములు. మే మెట్టి విషయములోను శ్రద్ధవహించుటకు వీలులేదు. మేము మా యేలికచేతిలోని ఆటవస్తువులము. అతడు మమ్ము శృంగారింపవచ్చును, లేదా వివస్త్రల గావింపవచ్చును. మాస్థితి నిన్న మొన్నటి వఱకు రష్యాలో నున్న బానిసలకన్న హీనముగ నున్నది.

"* * * నేను గోరంతలను కొండంతలుగ చేయుచున్నా నని మీ రనవచ్చును. రష్యా కాంగో మొదలగు ప్రదేశములలోని బానిసలను గూర్చి పూర్వము కొందరు రీల్లే అనలేదా? మీరు దక్షిణాఫ్రికాలోనున్న భారతీయుల దుస్థితికై వగచుచున్నారు. కాని మీరు మీ అభాగ్యసోదరీమణుల కరుణాక్రందనమును వినరా?"

ఎట్లున్నదో చూచితిరా, మహారాణులస్థితి? ఎన్ని ఇక్కట్టుల నిట్లు పడుచున్నను, వారిలో ఎవరో యొకరు సాహసించి పత్రికలకు వ్రాసిననే గాని మనకు నిజస్థితి తెలియరాదు. ఇటీవలనే సెంట్రల్ యిండియారాణులలో నొకర్తుక—భర్త తనను బెట్టుచున్న అంపవుశోతను గూర్చి యొక లేఖను వ్రాసినది. ఆమె కతడు వలసిన ఖర్చు లన్నిటికిక్రిందను నెలకు అయిదు రూప్యములను మాత్రమే ఇచ్చుచున్నా డట! ఆమెను వదలిపెట్టి కిశోరసింగు అను రాజపుత్రుని భార్యతో కాపురముచేయు చున్నాడట!

దీనినంతయు భరింపలేక మహారాణులలో కొందరు ఆత్మహత్య గావించుకొనుచుందురుకూడ! అతిశయోక్తి దీనిలో లేశమైనను లేదు. ఆ మధ్యనే ఆళ్వారుగారి రాణ్మండలములో నొకర్తుక కష్టములను— వీనిని మించిన యవమానములను— పడలేక జీవితమును చేతులార తుదముట్టించుకొనెను!

మహారాజుల వైవాహిక జీవితమును గూర్చి చూడ్గర్ అభి ప్రాయ మిది: "పెక్కుమంది సామాన్యమానవులను వివాహము సద్వర్తనావలంబనమునకును, సన్మార్గగమనమునకును ప్రోత్స హించును. కాని, విధివశముచే అది సంస్థానాధీశుని వక్రజీవన వాహినిని మఱింత వక్రగతిని బ్రవర్తింపజేయును."

## విలాసలీల

స్వదేశసంస్థానాధీశులు బహుపత్నీకులే కాదు,— ఘోర వ్యభిచారాసక్తులు కూడ! ఇట్లని ప్రతి సంస్థానాధిపతియు వ్యభిచారియే యని నా యుద్దేశము కాదు. వారిలో పలువురు సచ్చరితులును, సుగుణోపేతులును లేకపోలేదు. అట్టివారు మనకు అత్యంతవందనీయులు. ఇక పోగా, మిగిలినవారి విషయము :

ఒకప్పుడు 'చాంద్' (హిందీ మాసపత్రిక) కొందరు సంస్థానపతుల భోగలాలసతను గూర్చి పెక్కు గాథలను ప్రకటించినది. వానిలో కొన్ని ఉదాహరణరీత్యా :

"ఉన్నాడొక మహారాజు. నపుంసకుడాతడు. కాని, లోకమును మోసపుచ్చుటకై ఏడాదికొక పెండ్లిని చేసికొనుచుండును. దైవదుర్విపాకముచే అతనిపాలబడిన స్త్రీల జీవితమంతయు ఘోరనరకయాతనయే! కేవలము నరకయాతనయే కాదు,—కడుంగడు లజ్జాకరముకూడ. సాధారణముగ ఆ మహా

రాజు మధుపానము గావించి మత్తిల్లును. తన యిష్టమిత్రులనుగూడ మత్తిల్లజేయును. అందరును మధుపానమత్తతచే కన్నులు గానక యున్నప్పుడు, మహారాణులలో ఒకరిద్దరిని రావించి, మిత్రుల కామలిప్సను సంతృప్తిపఱుప వారి కాజ్ఞాపించును. ఈ అమానుషలీలను ఉన్నతాసనాధివసితుడై ఆశాపూరిత నేత్రములతో దిలకించుచు, అతడు ఆనందపరవశుడగుచుండును. ఇటీవలనే ఒక మహారాణి ఇట్టి నీచ నికృష్ట జీవితమును భరింపలేక, విలాసభవనమును ప్రవేశింపగనే తనను కౌగిట జేర్పవచ్చిన సంస్థానోద్యోగిని చేతనున్న పిస్తోలుతో కాల్చివైచెను. పిమ్మట పిస్తోలును మహారాజునకు గురిచూపి ఆ మానవతి ఇట్లనెను: "ఇప్పుడు నీ ప్రాణము నా చేతులలో నున్నది. తలచుకొనినచో నిన్నిక లేకుండజేసి భూభారమును తగ్గింపగలను కాని, నీ అదృష్టవశమున నేను హిందూవనితనై పోతిని. సత్సంప్రదాయము నన్నిట్టి కార్యమును చేయనిచ్చుట లేదు. నేను మాత్రము నా దౌర్భాగ్య జీవితమును అంత మొందించుకొన నిశ్చయించుకొంటిని." ఈమాటలను ముగించుటయే తడవుగ ఆమె గుండెపై కాల్చుకొని, ఆ విలాస భవనములోనే జీవనలీలను ముగించెను. విషయసుఖైక లాలసతతో అచట సమావేశమైన ఆ పశుప్రాయు లందరును మంత్రముగ్ధులు వోలె నుండిరి. నోరెత్త వారిలో సాహసమెవనికి ?

హృదయగమనము అకస్మికముగ నాగిపోవుటచే మహారాణి మరణించె ననుచు ఆ మఱునాడు ప్రకటించిరి!!!

ఇది మఱియొక మహారాజు విషయము: అతడు బహువినోద ప్రియుడు. అతనికి అత్యంత ప్రియమగు వినోదములలో ఇది యొకటి:

అతడు సారాయము త్రాగును. తన మిత్రులచే త్రాగించును. పిదప నేదైన నెపముతో వారి కులస్త్రీలను విలాసభవనములోనికి రప్పించును. ఉపస్థితులైయున్న స్త్రీ పురుషుల నేత్రములను నల్లనివసనములతో బంధించి, భోగింప ననుజ్ఞాపించును. ఇట్లు కళంకితుల గావించినవెనుక నేత్రావరోధములను తొలగింపజేయును. కండ్లు విప్పి చూచునరికి సోదరి సోదరుని వద్ద, తల్లి కుమారునివద్ద, మామ కోడలివద్ద, తండ్రి కుమార్తె వద్ద పడియుండుట కద్దు!!!

పీ రిద్దరి తలదన్నిన మహారాజు మఱొకడు రాజపుత్రస్థానములో నుండెడివాడు. క్షణభంగురమైన జీవితమును చాలించినను,—అతడు మరణించి కూడ చాలకాలము కాలేదు—అతని (యప) కీర్తి నేటికిని నిలిచియున్నది. * * * ఆ మహారాజు నపుంసకుడు. కాని, అతడు సమస్త సంసార సుఖములననుభవింప గోరుచుండెను. తనకోర్కె సిద్ధించుటకు అత డొకసాధనమును కనిపెట్టెను. దానిపేరు ఆమోదచక్రము (Joy-wheel). ఆ చక్రనిర్మాణ మిది: విలాసభవనము. దానిలో వలయాకార

ముగ నిరువది హంసతూలికా తల్పములు. వానిమధ్య రత్నఖచితసింహాసనము. ప్రతితల్పము మీదను వివిధవర్ణ విద్యుద్దీపములు. అన్ని దీపముల 'స్విచ్చి' సింహాసనము వద్ద. ఆ యామోదచక్రము నుపయోగించు విధాన మిది: కామేచ్ఛ కలిగినప్పుడు మహారాజు సేవకునకు సూచన గావించును. వెంటనే నలుబదిమంది స్త్రీపురుషులు – ఇరువది జంటలు – విలాసభవనములో బ్రవేశింతురు. మొదటి గంట కొట్టగానే ఒక్కొక్క జంట ఆమోద చక్రములోని ఒక్కొక్క తల్పమును జేకును. రెండవ గంట కొట్టగానే అందరును భోగ నిమగ్ను లగుదురు. రత్నఖచిత సింహాసనముపై సుఖాసీనుడై యున్న మహారాజు విద్యుద్దీపములను మధ్యమధ్య ఆర్పుచు, తిరిగి వెలిగించుచు ఈ రాక్షసదృశ్యమంతయు గాంచుచుండును. పిమ్మట ఆవేశముతో గ్రిందికి దిగి, తదేకదృష్టిగ సంభోగక్రియను నిరీక్షించును. తుదకు కామపిపాస పరిపూర్ణముగ విజృంభించినప్పు డతడు ఏపురుషునినైన ప్రక్కకు తొలగించి, తానే...

సుప్రసిద్ధ గ్రంథరచయితయైన కన్హయులాల్ గాబా సంయితము 'చాంద్' పత్రికవలెనే కొందరు స్వదేశ సంస్థానాధీశుల పతిత జీవితమును గూర్చి పెక్కు ఘోరవిషయములను వెల్లడించెను. ఆయన వ్రాసినవాని నెల్ల నిట బేర్కొని పాఠకుల హృదయములను కలతపఱచుట పాడిగాదు. మచ్చున కొక విషయ

మును మాత్ర ముల్లేఖింతును. ఎవడో యొక మహారాజు ఏటేటను వేసవికాలమున ముస్సోరీ కొండలమీదికి వాయునిషే వణార్థ మేగుచుండునట! అట పుంస్త్వపు పోటీపరీక్ష (virility contest) ను జరుపుచుండునట! దానిలో గెలుపొందినవానికి బహుమానము లొసగుచుండునట!!

వారును, వీరును వ్రాసిన గాథ లేల? ఉత్తర హిందూస్థాన సంచారములో కొందరు సంస్థానాధిపతుల పతితజీవితమును గూర్చి నేనే స్వయముగ పెక్కు విషయములను వింటిని. ఆవిన్నవానిలో ఇది యొకటి: ఏ కార్యదర్శిగానో, తోటమాలి గానో పనిచేయుటకు ఆటపాటలలో ఆరితేరినయువకులు కావ లయు ననుచు ఒక మహారాజు వార్తాపత్రికలలో ఎల్లప్పుడును ప్రకటించుచుండునట! ఉద్యోగకాంక్షగలవారు వినతి పత్రి ముతో తమ ఛాయాచిత్రములను సయితము పంపవలె ననుచు నిబంధన నేర్పరుచునట! పిమ్మట దరఖాస్తు చేసినవారి చిత్రి ముల నెల్ల గాంచి, వారిలో తనకు నచ్చినవారికి వెంటనే రావలసినదనుచు ప్రయాణపుఖర్చులను పంపించుచుండునట! ఇట్లు వచ్చినవారిలో తమ మానాభిమానములను అమ్ముకొను టకు సంసిద్ధపడినవారికి— ఉద్యోగమును కల్పించియైనను— ఇచ్చుచుండునట!!! వార్తాపత్రికలలోని ప్రకటనను గాంచి మోసపోయిన ఒక యువకుడే నాకీ విషయమును దెలిపెను.

ఊరు పేరులు లేకుండ సంస్థానాధీశులను గూర్చి నేను కాకమ్మకథలను చెప్పుచున్నా నని పాఠకులు శంకించినను, శంకింపవచ్చును. ఇట్లు వారు శంకాన్వితు లగుట సహజము. కాదా మఱి? మానవుడు — అందును పెక్కుమంది ప్రాణ మాన ధనములను సంరక్షింపవలసిన బాధ్యత గలవాడు — ఇట్టి నీచాతినీచకార్యములకు ఒడిగట్టగలడా యని యెవరికైనను సందేహము కలుగకపోదు.

అందుచే — కడు ప్రసిద్ధమైన గాథ లగుటచే ప్రత్యేకముగ నుల్లేఖించుట కొంతవఱకు కనవసరమైనను — కొందరు మహా రాజుల వ్యభిచారలీలలను వేఱొక ప్రకరణమున సంగ్రహముగ వర్ణింతును.

# వ్యభిచారము

పదచ్యుతులైన తుకోజీరావు హోల్కారుగారిది మొదటిగాథ:

జె. డబ్ల్యు. బ్లేకుగారు లండన్ "వీక్లీ డిస్పాచ్" లో నిట్లు వ్రాసిరి:

"ఒక బీదమహమ్మదీయ కుటుంబములోనిది, ముంతాజ్ బీగం. కాని, చక్కనిది. మంచి విలాసప్రవర్తనము గలది. అందుచే మహారాజు మోహితుడై ఆమెకు తన రాణివాసములో ప్రథమస్థాన మొసగెను.

"ఆమె కేమి కావలసినను సరియే— దాని ఖరీదుతో లెక్క లేదు— తెచ్చియిచ్చెడువాడు. కాశీ, కాశ్మీరము, మహాబలేశ్వరము. మొదలగు ప్రదేశములనుండి తెప్పించిన అమూల్యములైన పట్టుచీరలొక బీరువానిండ పెట్టి ఆమె కొసంగిరి. ఆమె ధరించునగలో! అమూల్యములైనవే! అందు కొన్ని ఇండూరు సంస్థానపు జవాహిరీలోనివి; కొన్ని పారిస్ వర్తకుల నుండి ప్రత్యేకముగ కొని తెచ్చినవి. ఎల్లప్పుడును ఆమె వెంట

అనేక దాసీజను లుండెడివారు. మహారాజావారి ప్రత్యేకపు రైలుబండిలో ఆమెకు విడిగా నొక పెట్టె యమర్చబడి యుండెడిది. 'రోల్సురాయి' మోటారుకారు ఎప్పుడు ఆమె యధీనమునం దుండెడిది. కాని, ఆమెకు స్వేచ్ఛ లేదు; రాజ కుమారికల కుండు ఉపజ్ఞకూడ లేదు; దిన దినమూ మె పిట్టవలె నిట్టి బంగరు పంజరములో కొట్టుకొనుచుండెడిది.

"ఆ రాణివాసములు అసూయల కాకరములు * * * అందుచే మహారాజావారి సాదరభావము మంతాజికి కొన్ని వేళల కీడుగా పరిణమించెడునటుల కాన్పించుచుండెడిది. * * * నిరుడు మహారాజారి పుత్రునికి— యువరాజునకు— వివాహము జరిగినది. * * * ఆ వివాహములో ఖర్చులకు అంచనా నేబది లక్షలకు వేసిరి. ఇందు సగము కేవలము దుబారాగా పాడైనది. * * * ఆ పెండ్లియైన తరువాత హిమాలయములలోని ముస్సోరికి ప్రయాణము గట్టిరి. అప్పుడు మంతాజ్ పంజరమునుండి యెగిరిపోయినది."

మంతాజ్ భోగభాగ్యముల నెల్ల కాలదన్ని పారిపోవుటకు తగిన కారణము లేకపోలేదు. 1925 వ సం॥రము జనవరి 24 వ తేదీ 'కృష్ణాపత్రిక' నుండి ఈ క్రింది విషయము లుద్ధృతములు:

"1921 వ సం॥రము ఏప్రిల్ నెలలో మహారాజుగారు ఇంగ్లండునకు బోవుచు మంతాజ్‌నుగూడ వెంట నిడుకొనిపోయి,

కమలాబాయి యను మాఱుపేరున వ్యవహరింపజేసిరి.
* * * మంతాజ్ యింగ్లాండునకు పోయివచ్చిన యొక సంవత్సరమునకు గర్భము దాల్చెను. అప్పు డామె యెంతయో ప్రార్థింపగా ఆమెతల్లియగు వజీరుబీగమును, మఱికొందరు బంధువులును ఆమెతో నుండుటకు అనుమతి నిచ్చిరి.

"తరువాత ఆమె యొక యాడపిల్లను గనెను. పుట్టి నపుడు పిల్ల బ్రతికియే యున్నది. కాని, కొంతసేపటికి దాదులు ఆ శిశువు చనిపోయె నని తెలిపిరి. ఇందుచేత మంతాజ్ బేగమునకు మనసు విరిగిపోయి, అంతటితో మహారాజును పరిత్యజింప నిశ్చయించుకొనెను."

ఎట్లో తప్పించుకొని పోయిన మంతాజ్ బేగం అష్ట కష్టములబడి బొంబాయి చేరుకొనెను. అక్కడకు చేరిన కొంత కాలమునకు అబ్దుల్ ఖాదిర్ బావలా యను నతడు ఆమెను దగ్గరకు దీసెను. ఈతడు బొంబాయి కార్పొరేషను సభ్యుడు. కోటీశ్వరుడు. మంతాజ్, బావలా గృహమునం దుండగా ఆమెను పరిత్యజింప వలసిన దనియు, పరిత్యజించినచో కోరినంత ధనము నిచ్చెద మనియు, లేనిచో హతమార్చెద మనియు బావలాకు ఎక్కడ నుండియో ఉత్తరములు వచ్చుచుండెడివి. కాని, బావలా మంతాజ్‌ను పరిత్యజింప నిచ్చగింపలేదు. మంతాజ్‌కు గూడ ఇట్టి యుత్తరములు వచ్చెడివి. కాని, ఆమె బావలా సంరక్షణ మున వీరిని లెక్కజేయకుండెను.

తదుపరి వృత్తాంతము 1925 వ సంవత్సరము జనవరి 17 వ తేదీనాటి కృష్ణాపత్రికలో నిట్లున్నది:

"ఈ నెల 12 వ తేదీనాడు సాయంత్రము 5 గంటల వరకును కార్పొరేషను సమావేశమున పాల్గొన్న తర్వాత బావలా మోటారుబండి నెక్కి షికారునకు బయలుదేరెను. ఈతనితో మంతాజ్ బేగంకూడ నుండెను. చౌపాత్ సముద్ర తీరమునకు వచ్చుసరికి అక్కడ మఱొక కారులో బావలా కార్యదర్శి కె. యి. మాత్యూ షికారేగుచుండుట గాంచి, ఆతనినికూడ తమ కారులో నెక్కించుకొని బయలుదేరెను. అక్కడినుండియు ఒక మోటారుబండి, వీరిని వెంటాడ సాగెను. మొదట వీరు దానిని గమనింపలేదు. వీరి మోటారు మలబారుకొండలమీద 'హాంగింగ్ గార్డెన్స్' దగ్గరకు వచ్చునప్పటికి రోడ్డు వంకరతిరుగ వలసివచ్చినది. ఆ వంకర త్రిప్పుచుండగా వెంబడించుచున్న మోటారుకారు వచ్చి వీరి బండికి కొట్టుకొనెను. బావలా షాఫర్ మహమ్మదీయుడు, వెనుక బండి తగులుటచే దాని షాఫర్ తాగియున్నాడని యెంచి, తన మోటారును కొంచెము ఆపెను. తోడనే ఆమోటారునుండి ఐదుగురు దుండగీడులు దుమికి, వీరిపై వచ్చిపడిరి. వారు మొదట ఈ షాఫర్‌ను కొట్టిరి. అతడు స్మృతితప్పి పడిపోయెను. అప్పుడే చీకటి పడినది. ఆ చీకటిలో ఆ దుండగీడులు పఠానుజాతివారివలె గన్పట్టిరి. తరువాత

కారులోనివారిపై బడిరి. తుపాకుల మ్రోత వినబడెను. లోని ముగ్గురును సహాయమునకై బొబ్బలిడిరి. ఒక చివర గూర్చుండి యున్న మాతుర్యా ఎటులనో కుడిచేతిని తన కడ్డము పెట్టు కొని, బయటకు దూకెను. మధ్య గూర్చుండియున్న బావలా లేచుటకు గూడ అవకాశము లేకపోయెను. దుండగీడులు అతని చుట్టుముట్టి తుపాకుల పేల్చిరి. రెండుదెబ్బలు పొట్ట మీదను, ఒకదెబ్బ ఎదురురొమ్మునందును తగిలెను. వారిలో ఒకడు ముంతాజ్‌ను కత్తితో చాల చోటుల పొడిచివైచెను. కాని, ఆమె లొంగక పెనగులాడుచుండెను. ఇంతలో దైవ సంకల్పవశముననో యన్నటుల ఆదారినే యాదృచ్ఛికముగ ఆంగ్లేయ సైనికోద్యోగులు నలుగురొక కారులో వచ్చు చుండిరి. అందు రాయల్ ఇంజనీర్లకు జెందిన లెఫ్టినెంటుసీగార్ట దూరమునుండియే ఈ బీభత్సదృశ్యమును గాంచి, అప్పటి కా యువతిపై బడి పొడుచుచున్నవానితో దలపడెను. వాడును ఊరకుండలేదు. జేబులోనున్న రివాల్వరును దీసి, సీగార్టపై పేల్చెను. వెనుకనుండి తక్కినవారు కత్తుల విసరిరి. రెండు, మూడు తుపాకిదెబ్బలు తగిలినవి. కాని, సీగార్ట తా బట్టుకొనిన వానిని మాత్రము విడువలేదు. ఇంతలో ఈ కోలాహలమం తయు విని చుట్టుప్రక్కల వా రందరును వచ్చిరి. సీగార్ట పట్టుకొనినవాడు తప్ప తక్కినవా రందరు మరి నిలిచిన లాభము లేదని యెంచి, మోటారులోనికి దుమికి, తమ్ము నెవ్వరు అడ్డ గింపకుండ నలువంకల తుపాకులను బేల్చుచు, పలాయితు

రైరి. ఒక్కడు మాత్రము చిక్కెను. * * * ఆస్పత్రికి పోవు నప్పటికి 9 గంటలయ్యెను. రాత్రి 12 గంటలవరకు బావలా వ్యక్తతోనే యుండెను. అతడు తన యాస్తినంతయు, తల్లి కిచ్చి ఏబదివేల రూపాయలను మాత్రము ముంతాజ్ బేగంపేర వ్రాసెను. ఆపరేషను చేయగనే, రాత్రి 1 గంటకు అతడు పరలోకగతు డయ్యెను.”

తదుపరి ఇందూరు సంస్థానోద్యోగులను తొమ్మిదిమందిని అరెస్టు చేసి, బొంబాయి హైకోర్టులో విచారించిరి. వారిలో ఇద్దరను వదలివేసిరి. తక్కిన వారిలో కొందరికి ఉరిశిక్షయు, మరి కొందరికి ద్వీపాంతరవాసమును విధించిరి.

ఆ పిమ్మట బావలాహత్యతో తుకోజీరావు హోల్కారుగారికి సంబంధము గలదో, లేదో నిర్ణయించుట కొరకు ప్రత్యేక విచారణ సంఘమును నియమించుటకు భారత ప్రభుత్వమువారు నిశ్చయించిరి. ఈ సంఘము నెదుర్కొనుటకు సాహసము లేక తుకోజీరావుగారు రాజ్యాధికారమును త్యజించి మనశ్శాంతికై (?) విదేశముల కేగిరి.

విదేశముల కేగి రన్న మాటయేగాని వారికి మనశ్శాంతి లభింపనే లేదు,— తిరిగి ప్రణయలీల ప్రారంభ మగుచుండెను. వారు ముందుగ స్విట్జర్లాండు వెళ్ళిరి. అచ్చటినుండి ఫ్రాన్సుకు పయనమైరి. కాని యెక్కడను కోరిన చిత్తశాంతి దొరకనే లేదు. తుదకు తుకోజీరావుగారు కాలిఫోర్నియా (అమెరికా)

చేరిరి. అక్కడ వారికి మిల్లరుకన్యతో పరిచయము కలిగెను. పరిచయము తొందరలో ప్రణయముగాను, ప్రణయము పరిణయముగాను మారెను. మిల్లరుకన్యకు హిందూ మతమునిప్పించి, తుకోజీరావుగారు ఆమెను వైభవముగవివాహ మాడిరి. ఈ వివాహమును గూర్చి "చాంద్" పత్రిక యిట్లు వ్రాసినది. "కొందరు జోహుకుములు, మహారాజు గారికి మిల్లరుకన్యతో ధర్మశాస్త్రబద్ధముగ వివాహము జరిగిన దని వాదింపవచ్చును. కాని, దీనిని మేము సమర్థింపజాలము. * * * శారదా పీఠ శంకరాచార్య స్వాములవారు ఈ పాపా చారముపై ధర్మముద్రను వైచిరి. ఏ ధర్మమైనను ఇద్దరు భార్యలు జీవించియుండ మూడవ వివాహము గావించుకొను టకు అంగీకరించినచో అది ధర్మముకాదు, కానేరదు. ఇదియే ధర్మమైనచో, ఇట్టి ధర్మసాంప్రదాయములను కూలద్రోయ వలసినసమయ మాసన్నమైనది."

రెండవకథ 'మిస్టరు ఏ'ది:

'మిస్టరు ఏ' 1925 వ సంవత్సర ప్రాంతమున విదేశపర్యటన మున కేగెను. అప్పుడు పారిస్‌నగరములో నుండగా వారికి రాబిన్సను సతితో పరిచయము గలిగెను. ఈమె అంతకు ముందునుండియే భర్తతో కాపురముచేయుట మాని, మాతా పితరులనుండి సంక్రమించిన ఆస్తితో విలాసముగ లండన్, పారిస్ నగరముల విహరించుచుండెను. ఈ స్వేచ్ఛా సంచారములో

ఆమెకు న్యూటన్ అనువానితో కొంత సంబంధ మేర్పడెను. న్యూటన్ గజదొంగ. ఆవులించిన ప్రేవులు లెక్కపెట్టగలవాడు. అతడు రాబిన్సనుసతి—'మిష్టరు ఏ'ల పరిచయము త్వరిత గతిని ప్రణయములోనికి మారుట కనిపెట్టెను. వెంటనే రాబిన్సన్ వద్ద కేగి "నీ భార్య ఒక నిగ్గర్‌తో పోవుచున్నది. ఆమెను డివోర్సు చేయు" మని హెచ్చరించెను.

రాబిన్సన్ అమాయకుడు. తన భార్య శీలమునుగూర్చి అంత వఱకత డెన్నడును శంకించియైన యెఱుగడు. న్యూటన్ చెప్పిన మాట వినుసరికి అతనికి కోపము వచ్చెను. మాఱుమాటాడక డివోర్సు పుచ్చుకొనుటకు అతడు అంగీకరించెను.

న్యూటన్—రాబిన్సన్‌లు, హాబ్సు అను సొలిసిటరు గుమాస్తా వద్దకు వెళ్ళిరి. ఈ హాబ్సు తానే సొలిసిటరుగా నటించి వలసిన కాగితములను సిద్ధపరచెను. అమాయకు డగు రాబిన్సన్ తాను చేయవలసిన సంతకములను చేసి యింటికి పోయెను.

పిమ్మట హాబ్సు—న్యూటన్‌లు "డైవోర్సుకుగాను దావా చేయుచున్నాముగాన, జాగ్రత!" యని 'మిష్టరు ఏ'ను బెదరించి, మిడ్లండ్ బ్యాంకుపై $1\frac{1}{2}$ లక్షల పౌండ్లకు 'చెక్కు' పుచ్చుకొనిరి. ఈ 'చెక్కు'పై రాబిన్సన్ సంతకమును 'ఫోర్జరీ' చేసి, మొత్తము నంతటిని తామే పుచ్చుకొని 21 వేల పౌండ్లను మాత్రము రాబిన్సన్‌కు చెల్లించిరి. 'మిష్టరు ఏ' మొత్తము 25 వేల పౌండ్లనే యిచ్చెననియు,

దానిలో 4 వేల పౌండ్లు హాబ్స్ ఫీజుక్రింద చెల్లిపోయెననియు చెప్పిరి.

హాబ్స్ — న్యూటన్‌లు చేసిన మోసము కొంతకాలము గడచినపిదపగాని రాబిన్సన్‌కు తెలియదు. అప్పు డతడు 'చెక్కు' మొత్తమంతయు తనకు రావలసియున్న దని మిడ్లండు బ్యాంకుపై వ్యాజ్యము తెచ్చి, గెలిచెను.

ప్రస్తుతపు కాశ్మీర మహా రాజుగారే ఈ కథలోని 'మిస్టరు ఏ' !!!

రాంపూరు నవాబుగారిది మూడవగాథ :

1933 సెప్టెంబరు 17 వ తేదీని వెలువడిన 'ప్రిన్సిలీయిండియా' పత్రికలో ఇట్లున్నది:

"ఇటీవలనే రాంపూరు నవాబు తన తల్లిని, సోదరిని ఎట్లు సత్కరించెనో చూడుడు! రాజమాతను కుమార్తెతో నవాబు రాంపూరు పురాతనదుర్గములో బంధించెను. తన యేకైక పుత్రిక పక్షము వహించినందులకై రాజమాతను కొట్టినంత పని చేయించెను.

"ప్రజలను బాధపెట్టిన ప్రభువుల సంగతి నే వినియున్నాను. కాని, కన్నతల్లిని, తోడబుట్టువును రాంపూరు నవాబువలె సత్కరించిన భూపాలుని అన్యునిగూర్చి నే నింతదనుక కని, విని యెఱుగను. వారి నిట్లు బాధించుటకు గల కారణ మేమి?

వా రేదైన తప్పు చేసిరా? లేదు. అతని ఘోరపశువాంఛలే దీనికి కారణము.

"రాంపూరు నవాబును చూచిన నాకు జాలి కలుగుచున్నది. కామోద్వేగమును, నిరంకుశాధికారమును అతనికన్ను గప్పినవి. ఇందుచే అతనికి వావివరుసలుకూడ తెలియుట లేదు. ఇట్లు బాధింపబడుటకు రాజమాతయు, ఆమె పుత్రియు చేసిన పాపము లెవ్వి? పడుచుదనములోనున్న నవాబు తన మేనల్లుండ్ర నిద్దరిని వారి భార్యలను 'డివోర్సు' చేయుడని కోరెను. మేన ల్లుండ్ర భార్యల సౌందర్యము అతని చిత్తము నాకర్షించినది. ఇదియే గొడవ కంతకును కారణము.

"నవాబు తాను కోరినంతమందిని వివాహమాడవచ్చును. వలసినంత మందిని ఉంచుకొనవచ్చును. జగదేక సుందరీమణు లను చేరదీయవచ్చును. అందులకుతగిన శక్తిసంపన్నత అతనికి కలదు. అట్టియెడ ఆతడు నిరపరాధులును, నిస్సహాయులు నగు తనమేనల్లుండ్ర భార్యలపై కన్నువేయ నేల? వారిని కన్నకుమా ర్తెలవలె చూచుకొనుటకు బదులు, భార్యలగా నొనర్చుకొను టకు యత్నింప నేల? ఇదెట్టి వాంఛ? బహుశః చికిత్సావిధా నమునకు లొంగని యొక విపరీతరోగ మిది.

"అవినీతికరమును, అమానుషమును నయిన ఈ వరిణయేచ్ఛ నంగీకరింప లేదనుకారణమున రాంపూరునవాబు తనతల్లిని, సోద రిని, మేనల్లుండ్రను దినములతరబడి కారాగారమున బంధించెను.

చిన్న మేనల్లుని నిర్బంధించి, అతనిచే భార్యను డివోర్సుచేయించెను. ఈ చిన్న మేనల్లుని మామ మాలేర్‌కోటనవాబు.

"మాలేర్‌కోట నవాబు జోక్యము కల్గించుకొని, తన అల్లుని సమర్థింపవలసియున్నది. కాని అతడింతవఱకు అల్లుని విషయమై పట్టించుకొనినట్లు లేదు. మాలేర్‌కోట నవాబు రాంపూరు సంస్థానాధీశునే అల్లునిగా బడయజూచుచున్నాడు కాబోలు! ఇదెంత చక్కని ఆలోచన!!

"మాలేర్‌కోట నవాబు కుమార్తెను 'డివోర్సు' చేయుమని నిర్బంధించినప్పుడు రాంపూరు నవాబు తన మేనల్లునికి తిరిగి పెండ్లిచేసెద ననెను. రాంపూరు నవాబునకు ఏడాది కూతురు గలదు. ఈ యేడాది పసికూననే 19 సంవత్సరములు నిండిన తన మేనల్లుని వివాహమాడ మనుచున్నాడు."

ఈ నవాబుగారినిగూర్చి 'ప్రిన్సిలీ యిండియా' ఇట్లే మఱి పెక్కువిషయములను ప్రకటించినది; ప్రకటించుచున్నది. వాని నన్నిటిని ఇట పేర్కొనుట అనవసరము.

ఇక జాభ్వా సంస్థానాధిపతి రాజా ఉదయసింగ్ కథ ఇది:

ఇతడు 1934 ఏప్రిల్ నాటికి మొత్తం తొమ్మిది వివాహములను చేసుకొనెను. ఆ తొమ్మిది మంది పత్నులపేర్లు ఇవి:

1. దిమొహర్ రాణి
2. ధరంపురి రాణి

3. ఖరోట్ రాణి
4. షిమొపూర్ రాణి (గౌరాణీ)
5. ధరియావాడ్ రాణి
6. సంతరాంపూర్ రాణి
7. కురవాడ్ రాణి
8. భరాడ్ రాణి
9. పల్లీ రాణి

ఈ తొమ్మిదిపత్నులు చాలక పస్వానులు అనే వారిని ఇరవై ఆరుమందిని ఇతడు చేరదీసినాడు. పస్వానులు అనగా సంస్థానాధిపతి పెండ్లితంతు లేకుండా చెట్టబట్టిన వనితలు. వీరు ఇతరుల భార్యలైన కావచ్చును. అయినప్పటికిని విడాకులతో అవసరములేదు. సంస్థానాధిపతి కాముకదృష్టి పడినతర్వాత ఆమె ఎంతటి మహిళామణి అయినప్పటికిని అతడికి లొంగిపోనైనా పోవలెను; లేదా తనకు, తన వారికి ప్రాణమోసమును తెచ్చుకొనైనా తెచ్చుకొనవలెను. ఈ జాభ్వారాజు పస్వానులను గురించిన వివరములు ఇవి:

| సంఖ్య | పస్వాన్ పేరు | భర్త ఉన్నట్టయిన అతడి పేరు | ఇతరభోభోగట్టా |
|---|---|---|---|
| 1 | భగీరథీబాయి | కిషన్ (రట్లాం) | |
| 2 | నవరతన్‌బాయి | జగన్నాథ్ | |
| 3 | చంద్రాబాయి | సువ | |

| | | |
|---|---|---|
| 4 నాభీబాయి (జూనియర్) చెయిన్ సింగ్ | | |
| 5 మోతి | | చనిపోయినది |
| 6 గామిరా | నారాయన్ | చనిపోయినది |
| 7 కన్వేరి | రామ | |
| 8 గులి | మదన్ | |
| 9 కాళీబాయి | జగన్నాథ్ | |
| 10 కోది | ఫట్టా (నం. 11 మీనాతల్లి) | |
| 11 మీనా | (నం. 10 కోదికూతురు) | |
| 12 రామజ్యోతి | మదన్ (నాబితల్లి) | |
| 13 సుందరి | | |
| 14 మెతాబ్ | మోహన్ | చనిపోయినది |
| 15 పార్వతి | | |
| 16 లలిత (థియోఫుర్) | | (జానిచెల్లెలు) |
| 17 నాబి (సీనియర్) | | |
| 18 ఘోషీ | కన్హయలాల్ | |
| 19 రామస్వరూపి | రామ | |
| 20 మోతి | బాబాజాన్ | |
| 21 దేవ్ ధభయాన్ | | |
| 22 సామద్ | జగ్గు | చనిపోయినది |
| 23 సూర్జి | ఖమ | |
| 24 జాభీబాయి | భర్తఎవడైనది తెలియదు | |

25 వసంతి ప్రతాప్
(మహారాజు ఈబాలిక కన్యాదాత)
26 లలిత కిశోర్‌సింగ్
మహారాజు ఈబాలికకుకూడ కన్యాదాత)

పోనీ, ఇంతటితో ఇతడి కామతృష్ణ తీరినదా? అబ్బే! లేదు! వీరికి తోడుగా ఇతడు ఫీజ్, మఘియా, శాంత కుమారి అను ముగ్గురు భోగపుస్త్రీలను ఉంచుకున్నాడు కూడా!!

ఇట్లున్నవి కొందరు సంస్థానాధిపతుల విషయవాంఛా పూరణోపాయములును, వ్యభిచారాసక్తియు. ఇట్టి కామ ప్రవృత్తి గల మహారాజులు చేయు ఘోరదురంతములను గాబా యిటుల విశదీకరించుచున్నాడు:

"సంస్థానాధిపతి అంతఃపురమున జరుగు విషయములనెల్ల తెలిసికొనుట దుస్సాధ్యము. అప్పుడప్పుడు మాత్రము సత్యము చూచాయగ తెలియవచ్చుచుండును. కొలది వత్సరముల క్రితమే పదచ్యుతుడుగావింపబడిన ఒక సంస్థానాధీశుని అంతఃపురమున భూస్థాపితమైన పెక్కుమంది స్త్రీల అస్థులు కాన్పించెను. సంస్థానాధిపతి గాఢపరిష్వంగమును నిరాకరించినందులకే వీరికీగతిపట్టెను. ఈ భోగలాలసులను 'కా'దనుటకు గొప్ప ఆత్మశక్తి కావలెను. 'కా'దనినస్త్రీ తనను పెట్టిన హింసలను ఇతరులతో సాధారణముగ జెప్పుకొనదు. ఆ ఘోరదురంతము

# స్వంత ఖర్చు

వేళ్ళమీద లెక్కపెట్ట వచ్చునేమో సక్రమముగ పరిపాలింప బడుచున్న సంస్థానములను! వీనిలో ప్రధానములుగా ఎన్నదగినవి మైసూరు, బరోడా, తిరువాన్కూరులు. ఈ సంస్థానాధీశులు సయితము స్వంతఖర్చు (Privy Purse) క్రింద బొక్కసమునుండి అనవసరముగ (అక్రమముగ?) హెచ్చు మొత్తమును గైకొనుచున్నారు.

మైసూరు మహారాజుగారు 1931-32 సంవత్సరములో స్వంత ఖర్చు క్రింద 21 లక్షల రూప్యములను గైకొనిరి. ఆ సంవత్సరములోనే తిరువాన్కూరు మహారాజుగారు 14 లక్షల 56 వేల రూప్యములను తీసికొనిరి. సంస్థానాదాయములో నూటికి సుమారు 5 వంతుల చొప్పున మైసూరు మహారాజుగారును, 7 వంతుల చొప్పున తిరువాన్కూరు మహారాజుగారును స్వంత ఖర్చుక్రింద వాడుకొనిరని దీని యర్థము.

ఈఖర్చుల విషయములో మైసూరు, తిరువాన్కూరు మహారాజులను ఇటలీ దేశాధీశునితో పోల్చి చూతముగాక! ఇటలీ

స్వతంత్రదేశము. ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ మున్నగు దేశ ములతో దానికి సమానమగు ప్రతిపత్తి కలదు. కోరినచో అది ప్రపంచశాంతిని కాపాడగలదు, లేదా, భగ్నమొనర్ప గలదు. ఇట్టి దేశాధీశునికన్న మైసూరు మహారాజుగారు స్వంత ఖర్చుల క్రింద $1\frac{1}{2}$ రెట్లు హెచ్చు మొత్తమును స్వీకరించుచున్నారు! తిరువాన్కూరు మహారాజుగారు దాదాపు సరిసమానమగు మొత్తమును పుచ్చుకొనుచున్నారు!!

ఇట్లని మైసూరు వార్షికాదాయము ఇటలీ యాదాయముకన్న హెచ్చుగ నున్నదనిగాని, తిరువాన్కూరు సాలీనా రాబడి ఇటలీ రాబడికి కుడి యెడమగ నున్నదనిగాని భావింతురేమో! కాదు! ఇటలీదేశపు ఆదాయము దాదాపు 20 కోట్ల పౌండ్లు. మైసూరునకు వచ్చునది దానిలో $\frac{1}{70}$ వంతు మాత్రమే! ఇక, తిరువాన్కూరు రాబడి షుమారు $17\frac{1}{2}$ లక్షల పౌండ్లే!! తదితర సంస్థానాధీశులకు ఆదర్శప్రాయు లని చెప్పదగు మైసూరు తిరువాన్కూరు మహారాజులే స్వంత ఖర్చులకై అధికముగ నిట్లు గైకొనుచున్నప్పుడు తక్కినవారి సంగతి వేఱుగ చెప్ప నక్కరయే లేదు. ఐనను స్థితిగతు లెంత ఘోరముగ నున్నవో తెలుపుటకు ఒక రిద్దరు సంస్థానాధిపులనుగూర్చి ఉదాహరణ ముగనైనను వ్రాయకుండుట సమంజసము కాదు.

ప్రపంచ విస్తృత సామ్రాజ్యాధిపతియగు బ్రిటిష్ చక్రవర్తి స్వంతఖర్చు 4,70,000 పౌండ్లు. అంత విస్తృత

సామ్రాజ్యాధిపతి కాకపోయినను, ఆ ఫాయాకే చెందిన జపాను చక్రవర్తి ఖర్చు 4,50,000 పౌండ్లు. నజరానాలు మున్నగు వానిని కలుపుకొనినచో నైజాము స్వంతరాబడి బ్రిటిషు, జపానుచక్రవర్తుల రాబడికి దాదాపు సరిసమానమే! ఇంతకంటె విపరీత ముండగలదా!! ఇక, వార్షి కాయదాయము చూాత మన్న బ్రిటిషు, జపాను ప్రభుత్వముల రాబడిలో హైదరా బాదునకు వచ్చునది $\frac{1}{300}$ వంతుకూడ లేదు!!!

"సర్వ ప్రపంచములో కెల్ల కడు ప్రియముగు ఒక విదేశీయ ప్రభుత్వమును కొనసాగించుటకే పైన పేర్కొనబడిన అన్యాయము లన్నియు జరుపబడుచున్నవి. ఉదాహరణముగ మీా వేతనమునే గైకొనుడు. అన్యమార్గముల సంక్రమించు మొత్తములుగాక మీాకు మాసమునకు రు 21,000 లు చెల్లింప బడుచున్నవి. బ్రిటిషుప్రధానామాత్యుని మాసిక వేతనము షుమారు రు 5,400 లు మాత్రమే! భారతదేశపు సగటు ఆదాయము దినమునకు రెండణాలైనను లేదు. కాని, మీారు దినమునకు 700 రూప్యములకు పైగా గైకొనుచున్నారు గ్రేటుబ్రిటను సగటు ఆదాయము రోజునకు దాదాపు 2 రూ పాయలు ఐనను, బ్రిటిషు ప్రధానామాత్యుడు రోజుకు 180 రూపాయలు మాత్రమే పుచ్చుకొనుచున్నాడు. భారతదేశపు సగటు ఆదాయము కన్న 5,000 రెట్లకుపైగా మీాకు ముట్టు చున్నది. బ్రిటిషు ప్రధానామాత్యునికి బ్రిటిషు సగటు ఆదా

యముకంటె కేవలము 90 రెట్లే !" అనుచు ఉప్పు సత్యాగ్రహమును ప్రారంభించుటకు ముందు వైస్రాయిగారికి వ్రాసెను గదా, మహాత్ముడు.

భారతీయుని నగటు ఆదాయముకన్న 5000 రెట్లను రాజప్రతినిధి పుచ్చుకొనుటయే అన్యాయమైనదో నైజాము చేయుచున్న పనిని ఏమనవలెనో పాఠకమహాశయులే నిర్ణయింపవలెను. నైజాము స్వంత రాబడి, భారతీయుని నగటు ఆదాయముకంటె ఏ లక్షరెట్లో, రెండు లక్షలరెట్లో ! !

ఒక్క సంవత్సరములో నైజామునకువచ్చు స్వంత రాబడిని నెలకు నూటికి 1½ అణాల వడ్డీ చొప్పున బ్యాంకులో వేసినచో, వట్టి వడ్డీడబ్బులతో గవర్నరు జనరల్ కును, ఆయన కార్య నిర్వాహక వర్గ సభ్యులంగరికిని శాశ్వతముగ వేతనములను చెల్లింపవచ్చును ! !

విదేశములతో సరిపోల్చి చూచినప్పుడు మన సంస్థానముల పరిస్థితులు ఎంత వ్యత్యస్తముగ నున్నదియు క్రింది పట్టికనుబట్టి గురుతింపనగును :

| | అధిపతి స్వంతఖర్చు ప్రభుత్వాదాయములో |
|---|---|
| ఇంగ్లండు | ... 1/1600 వంతు |
| బెల్జియం | ... 1/1000 ,, |
| ఇటలీ | ... 1/ 500 ,, |

| | అధిపతి స్వంతఖర్చు పరిభుత్వాదాయములో |
|---|---|
| డెన్మార్కు | ... 1/ 300 ,, |
| జపాను | ... 1/ 400 ,, |
| నార్వే | ... 1/ 700 ,, |
| స్పెయిను (రిపబ్లిక్ పూర్వము) | ... 1/500 వంతు |
| తిరువాన్కూరు | ... 1/17 ,, |
| మైసూరు | ... 1/14 ,, |
| నైజాము | ... 1/13 ,, |
| బరోడా | ... 1/13 ,, |
| కాష్మీరు | ... 1/5 ,, |
| బికనీరు | ... 1/5 ,, |

ఈ పరికరణారంభమున పేర్కొనిన సంస్థానాధిపతులే నిజమునకు చాల మెరుగు. వీరికన్న ఘనులు మఱికొందరు వచ్చిన ఆదాయములో సగమునకుపైగా తామే దిగమింగుదురు !

అనవసరముగ సైనికశాఖకై విపరీతముగ వెచ్చింపబడుచున్నదను విమర్శనుండి కొంతవరకైనను తప్పించుకొనవచ్చుననెడి ఉద్దేశముతో భారత పరిభుత్వము కొంత సైనిక వ్యయమును రైల్వేశాఖ, ఆర్థికశాఖ మున్నగు వానిపై రుద్దుచుండును. కొందరు సంస్థానాధీశులుకూడ ఇట్లే గావించుచున్నారు. రాజ మందిరమును బాగుచేయించుటకగు ఖర్చులను వారు పబ్లికు వర్కుసు శాఖపై వేయుచున్నారు. వేటకగు పైకమును ఫారెస్టుడిపార్టుమెంటుపేర ఖర్చు వ్రాయుచున్నారు. వేశ్యల

కగు ఖర్చును (గొబా చలో క్రిగ నన్నట్లు) హోం డిపార్టు మెంటు లెక్కలలో జేర్చుచున్నారు!

ఇందులకు ఉదాహరణముగ ఇందూరును గైకొనుడు. ఈ సంస్థానమునకు 1926 వ సంవత్సరమున 1,28,10,887 రూపాయలు ఆదాయము వచ్చెను. ఆ సంవత్సరపు బడ్జెటులో సంస్థానాధీశుని స్వంతఖర్చు నిమిత్తము 23,22,924 రూపాయలను ప్రత్యేకించిరి. మొత్తము వార్షికాదాయములో నూటికి 18 వంతులు చొప్పున సంస్థానాధీశుని స్వంతఖర్చుక్రింద చెల్లిపోయెనని దీని యర్థము. కాని, నిజమునకు అంతకన్న అధికము గనే స్వంతఖర్చుకై వ్యయపడెను. ఆ సంవత్సరములో లాల్ బాగ్ రాజమందిరమును నిర్మించుటకై 6 లక్షల రూప్యములు వెచ్చింపబడెను. ఈ మొత్తము స్వంతఖర్చులోనికి రావలసి యున్నను వానిని పబ్లిక్ వర్క్సుశాఖ లెక్కలలో జేర్చిరి. కొన్ని రాజమందిరములను బాగుజేయించుటకైన మఱి 6,000 రూపాయలనుకూడ పబ్లికు వర్క్సు శాఖపై రుద్దిరి. వేటకై ఖర్చుపెట్టిన 12,000 రూపాయలను సయితము మిల్లే అటవీ శాఖపై తోసిసిరి. ఈ మొత్తములను, ఇట్టివే యగు మఱి కొన్నిటిని కలిపి లెక్కకట్టినచో మొత్తము రాబడిలో సంస్థానాధీశుని స్వంతఖర్చు నూటికి 18 వంతు లగుటకు బదులు, 22 వంతులవఱకు పాకును!!

దాదాపుగ అన్ని సంస్థానములలోను లెక్కకట్టు పద్ధతి ఇంచు మించుగ నింతే! ఇదేటి న్యాయమో, ధర్మమో...

అమృతలాల్ ధక్కర్ "సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ" సభ్యుడు. అఖిలభారత హరిజనసేవాసంఘ కార్యదర్శి. అతడు అతివాది యనుటకు ఎవ్వడును సాహసింపలేడుగదా! అట్టి ధక్కర్, సంస్థానాధీశుల స్వంతఖర్చు విషయమై వ్రాసె నిట్లు: "తాము చేయుఖర్చుల విషయమై ఎవరికిని బాధ్యులుకాని కారణమున మహారాజులు ప్రస్తుతము సంస్థానపు బొక్కసమును తమ సొంతములైగాను, సంస్థానమును ప్రయివేటు ఎస్టేటుగాను పరిగణించుచున్నారు. ***పెక్కు సందర్భములలో సంస్థానాదాయములో సగమునకు పైగా మహారాజు గారికిక్రిందను, వారి కుటుంబముక్రిందను చెల్లిపోవుచున్నది."

కాలవైపరీత్యము వచ్చినప్పుడు కంచెయే చేనును మేయును గదా!

# దుర్వ్యయము

"ఆకలి మంటచే మాడిపోవుచున్న బిడ్డలస్థితిని చూడలేక తల్లులు చేతులార వారి కుత్తుకల నుత్తరించుచు, మాతృత్వమును మంటగలుపుచున్నా రొక దిక్కున. శ్వేతప్రభువరేణ్యుల నాహ్వానించుటకును, వారికి విందుల నొసగుటకును లక్షలకొలది రూప్యములు తగులవేయబడు చున్నవి మఱొక దిక్కున. సంరక్షణాలయములు సున్న యగుటచే వేనవేలుగ స్త్రీలును, శిశువులును మృత్యుముఖమున బడుచున్నా రొక వైపున. కుక్కలను కొని పెంచుటకై లక్షల లెక్కను ఖర్చు పెట్టబడుచున్నది వేఱొక వైపున. విద్యాలయములు లేనికారణమున కోట్లకొలది బాల బాలికలు విద్యాసముపార్జన మను జన్మహక్కును గోల్పోవుచున్నా రొకవంక. ప్రజారక్తరంజిత ధనరాశులు వేశ్యాచరణకమలసన్నిధిని సమర్పింప బడుచున్న వింకొక వంక" అనుచు 'చాంద్' పత్రిక వ్రాసె నొకప్పుడు సంస్థానాధీశులను గూర్చి.

ప్రజాదృష్టిని ఆకర్షించుటకై కోసిన కోతలు కావివి. ఈ వాక్యములలో ప్రత్యక్షరమును సత్యసమ్మతమైనదని నిదర్శనపూర్వ

కముగ నిరూపింపవచ్చును, పాఠకమహాశయులు క్రించె మోపిక పట్టినచో.

శ్రీ రిశేషులైన, నవానగరు జాం సాహెబుగారు— వీరికే బ్రిటిషు ప్రజలు 'రాంజీ' అను ముద్దు పే రిడిరి. వీరు క్రికెటు ఆటలో బహునిపుణులు. సంవత్సరమునకు తొమ్మిది నెలలు విదేశములలోనే కాపుర ముండెడివారు. పరమపదించుటకు ముందు 'స్వదేశీయుద్యమము'ను ప్రతిఘటించుటకై హైందవ వాంగ్లేయవాణిజ్యసంస్థను నెలకొల్పుటకు వీరు భగీరథయత్నము లొనర్చిరి. ఇంతకును చెప్పవచ్చిన దేమన, శ్రీ రిశేషులైన జాం సాహెబుగారు, వివిధ ప్రభుత్వోన్నతోద్యోగులకు స్వాగత సత్కారములను చేయుటకై క్రింద తెలుపబడిన విధమున ప్రజావిత్తమును వెచ్చించిరి:

| | | రూపాయలు (లక్షలలో) |
|---|---|---|
| సిడెన్హామ్ ప్రభువు | ... | 7 |
| వెల్లింగ్డను ప్రభువు | ... | 10 |
| లాయడ్ ప్రభువు | ... | 5 |
| రీడింగు ప్రభువు | ... | 5 |
| ఇర్విను ప్రభువు | ... | 25 (!!) |

తుదిని— జీవితములో తుది నని కాదు: పట్టికలో తుదిని— వెచ్చించిన 25 లక్షలరూప్యములును చెల్లిపోయిన విధముక్రింద చూడనగును.

| | | రూపాయలు (వేల సంఖ్యలో) |
|---|---|---|
| క్రొత్త మోటార్లు | ... | 400 |
| మోటారుబోట్లు | ... | 580 |
| నౌకర్లదుస్తులు | ... | 65 |
| అలంకారములు | ... | 200 |
| పుష్పమాలికలు | ... | 15 |
| కర్పూరహారములు | ... | 5 |
| క్రొత్తఎలక్ట్రిక్ సామానులు | ... | 150 |
| డేరాలు | ... | 50 |
| పెట్రోలు | ... | 25 |
| వేట | ... | 100 |
| విందు | ... | 100 |
| ఫర్నిచర్ | ... | 100 |
| ఫోటోలు | ... | 35 |
| తివాచీలు | ... | 30 |
| బాణసంచా | ... | 20 |
| చెప్పగారాని కార్యములకు | ... | 300 |
| తదితరములకు | ... | 315 |
| | | 2500 |

ఈ లెక్కలను జూచినప్పుడు పెండ్లము మెడలోని పుస్తె నమ్మి, శిస్తును చెల్లించు రైతు పడు చిత్తక్షోభ, హృదయావేదన...

ఇక, పాటియాలా *మహారాజాగారికి కుక్కలపై గల ప్రేమ జగద్విదితమే. లండన్ నగరమునకు పోయినప్పుడెల్ల కుక్క-

* ఈయన ఇటీవలనే చనిపోయినాడు.

లను కొనుటకై వీరు లక్షలాదిగ రూప్యములను వెచ్చింతురు. దీనిని గాంచి, కుక్కలన్న పడిచచ్చు ఆంగ్లేయులే అచ్చెరువందుదురు. మొదటి రౌండుటేబులు సభా సమావేశ సందర్భమున లండన్ వెళ్ళినప్పుడు వీ రెన్ని కుక్కలను కొనిరో నాకు సరిగ తెలియదుగాని, పందెపు పావురములు మున్నగువానిని మాత్రము విరివిగ ఖరీదు చేసిరి. అప్పుడే వీరు 50 వేల రూప్యములను వెచ్చించి, బనియనులు—డ్రాయర్లు (under-ware) కొనినట్లు నా కెక్కడనో చదివిన జ్ఞాపకము.

కుక్కలను ప్రేమించునది ఒక్క పాటియాలా మహారాజుగారే యని భావింతురేమో ! కాదు. సంస్థానాధిపతులలో మఱి పెక్కుమందికి కూడ కుక్కలపై ప్రేమయే ! ఇట్టివారిలో ఝిండ్ సంస్థానాధిపతి యొకడు. ఇతనివద్ద కొన్ని వేల పౌండ్ల ఖరీదుచేయు కుక్క లున్నవి.

సంస్థానాధీశ్వరు లిక వేటకై వెచ్చించున దింతింత యని చెప్పనలవి కాదు. పదచ్యుతులై పరమపదించిన ఆళ్వారు *మహారాజుగారి మృగయావినోద ప్రియాళుత్వమునుగూర్చి లండను 'డెయిలీ హెరాల్డు' పత్రిక యొకప్పు డిట్లు వ్రాసెను :

"మహారాజుగారు ప్రస్తుతము ఆజాబ్ గర్డవద్ద ఒక ఆనకట్ట (dam) కట్టించుచున్నారు. దీనివలన చక్కని నీటివసతి యేర్ప

* ఈయనకూడ మొన్న మొన్ననే కాలధర్మము చెందినాడు.

మును. పంటభూములకు కాదు — ఈ వసతి! మహారాజుగారు వేట కేగు అడవులకు మాత్రమే! ఆనకట్టవద్ద మూడు వేల మంది కూలీలను బలవంతపెట్టి పనిచేయించు చున్నారు. వీరికి కూలి నిచ్చుటలేదు. కేవల మింత కూడు మాత్రము వేయు చున్నారు.

"మృగయా వినోదములోనేగాక, యూరపియనులకు బ్రహ్మాండముగ ఆతిథ్య మొసగుటలోగూడ మహారాజుగారికి ప్రఖ్యాతి కలదు.

"1925 వ సం॥లో ఆళ్వారు సంస్థానమునకు మొత్తము 3,37,500 పౌండ్లు ఆదాయము వచ్చెను. దానిలో 52,000 పౌండ్లను యూరపియనులకు ఆతిథ్య మొసగుటకై వారు వెచ్చించిరి. మోటారుడ్రైవర్ల జీతభత్యముల నొసగుటకును, పెట్రోలు మున్నగువానిని కొనుటకును, గుఱ్ఱములను పోషించుటకును, మొత్తము 65,000 పౌండ్లను ఖర్చుచేసిరి సువారమునకై 11,500 పౌండ్లను వ్యయ మొనర్చిరి. ఇన్నిపోగా బడ్జెట్టులో విద్యకై ప్రత్యేకించిన మొత్తము 7,500 పౌండ్లే!"

పై వాక్యములు 'చాంద్' పత్రికలోనివి కావు. వీనిని వ్రాసినది, లండను 'డెయిలీ హెరాల్డ్.'

సంస్థానాధిపతుల మృగయావినోద ప్రియత్వ కారణముగా సంస్థానప్రజలు పడవలసిన కడగండ్లు ఇన్నన్ని కావు. ఇందుకు నిదర్శనముగా "యాన్ ఇన్‌సైడ్ వ్యూ ఆఫ్ నవానగర్"

అను కరపత్రమునుండి కొన్ని భాగములను ఉదహరించు చున్నాను :

"నవానగరు సంస్థానములో వేటాడుటకుగల సౌకర్యములు చాల ఖ్యాతిని బడసినవి. ఈ ఖ్యాతికి కారణము సంస్థానములో గల వన్య మృగములు కావు; వేటకై అరుదెంచు ప్రముఖులను సంతోషపరచుటకు విశేష ధనమును వెచ్చించి సంస్థానమువారు విపిన మధ్యమున చేయు ఏర్పాట్లు మాత్రమే! నవానగరు సంస్థానము ఏర్పాటు చేయు వేటశిబిరములు స్వర్గతుల్యముగా నుండునని అనేకులు మెచ్చుకొనిరి. కాని, ఈ ఏర్పాటులను చేయుటకుగాను ప్రజలరక్తమును పిండవలసివచ్చునను విషయము మాత్రము వారికి తెలియదు. వేటలను ఏర్పాటు చేయు సందర్భములో ప్రజలు మూడు విధములైన కష్టములను భరించవలసివచ్చును. అవి ఏవన: వన్యమృగముల సంరక్షణకు సంబంధించిన కఠిన నియమములు; వేటశిబిరముల ఏర్పాటు విషయమై కఠిన నియమములు; ప్రజావిత్త దుర్వ్యయము.

"వేటకు తగు పక్షులను, మృగములను సంరక్షించు నిమిత్తము సంస్థానము గెజెట్‌లో ఎప్పటికప్పుడు క్రొత్తక్రొత్త నిబంధనలను ప్రకటించుచుండురు. అట్టివానిలో కొన్నిటిని ఉదహరణ పూర్వకముగ క్రింద పేర్కొనుచున్నాను :

"1909 ఆగష్టు 13 వ తేదీనాటి 22 వ నవంబర్ హెచ్. ఇ. సి. ఎఫ్. నుండి:

"......ఈ నిబంధనలకు విరుద్ధముగా ఎవరైనను వర్తించినట్లు మేజస్ట్రేట్ సమక్షమున నిరూపితమైనచో, అట్టివారికి ఆరుమాసముల శిక్షనుగాని, నూరు రూపాయల జరిమానాను గాని, లేక రెంటినిగాని విధించవచ్చును......,

"1923 నవంబర్ 1 వ తేదీనాడు వెలువడిన స్టేట్ గెజెట్ నందు ముద్రితమైన 22 వ నంబర్ సర్క్యూలర్ నుండి:

"పోలీసు, రివిన్యూ అధికారులును, గ్రామోద్యోగులును వన్యమృగ సంరక్షణ విషయమై సంస్థానము చేయు నిబంధనల సక్రమ పరిపాలనమునకు తగు కట్టుదిట్టములను చేయవలెను. ఈ నిబంధనల అతిక్రమణము జరిగినట్లు తెలిసినచో మహా రాజు ప్రత్యేకోద్యోగిని నియమించి, ఆ విషయమై విచారణ జరిపింపవచ్చును. అట్టి సందర్భములలో ప్రత్యేకోద్యోగి తీర్పు పైన తిరిగి అప్పీలుకు అవకాశము లేదు.

"1919 ఏప్రిల్ 24 వ తేదీనాటి సర్క్యూలర్ నుండి:

"ఒక క్రొత్తజాతి లేడి సంస్థానములో తిరుగుచున్నది. ఈ లేళ్ళను బాధపెట్టినను, లేక గాయపరిచినను, అట్టివారికి అయిదు సంవత్సరముల కఠిన శిక్షయు, 1000 రూపాయల జరిమానాయు విధింతుము.

"చిరుతపులులు, లేళ్ళు, మరి ఇతర జంతువులు, అనేక రకముల పక్షులు—ఇవి అన్నియు వేట కనువగువానిగా ప్రకటింతురు. ఇట్లు ప్రకటన జరిగినతర్వాత వానికి— ఆత్మ రక్షణకు అవసరమై— ఇబ్బందికలిగించినను, దానిని మహాపరాధముగా పరిగణింతురు ఇట్టి అపరాధములు జరుగకుండ కని పెట్టి చూచుటకు అనేకమంది తాబేదారులు గ్రామముల వెంట తిరుగుచుందురు. ఈ తాబేదారులు ఏ గ్రామస్థునిపైనైనను పగ సాధింపదలచిన, అతడు వేటనిబంధనలను అతిగ్రమించినట్లు ప్రత్యేకోద్యోగికి ఒకఅర్జీని పెట్టిన చాలును. మారు మాటాడక ప్రత్యేకోద్యోగి తమతాబేదారుల సాక్ష్యముమీదనే ఆ గ్రామస్థునికి జరిమానా శిక్షనో, జైలుశిక్షనో విధించును.

"వన్యమృగము పంటలను పాడుజేసినను, మనుష్యులనే చంపుచున్నను దానిని బెదరగొట్టుటకు గాని చంపుటకుగాని వీలు లేదు. రెండు కథలు ఈ విషయమును నిరూపింపగలవు:

(1) నాగజా గ్రామమునకు చెందిన ఏడుగురు వర్తకుల మీద కౌజుపిట్టలను బెదరగొట్టిరను నేరమును మోపిరి. వారిని రెండు రోజులపాటు జైలులో నుంచి, ఒక్కొక్కరు నూరురూపాయల జరిమానాను చెల్లించిన మీదట వదలిపెట్టిరి.

(2) ఒక గ్రామపు పటేల్ మీద చిరుతపులిని చంపిన నేరమునుమోపి, అతనిని ఉద్యోగమునుండి తప్పించుటయేగాక, 1000 రూపాయల జరినామాను కూడ వసూలు చేసిరి.

(3) భాల్సాన్ గ్రామములో ఒక మాల మునలిదానిని చిరుత పులి చంపివేసెను. మునలిదానిపై పులిపడుట చూచియు తమ కొంపలు మునిగి పోవునను భయమున ఎవ్వడును ఆ అమ్మి సహాయమునకు పోలేదు.

(4) నుమేరి గ్రామములో చిరుతపులి గొల్లపిల్లవాని నోకనిని గాయపరిచెను. కాని, ఎవ్వరును వాని రక్షణకు పోలేరు.

(5) రాలీయా గ్రామములో ముగ్గురు అన్నదమ్ములున్నారు. వారి ముగ్గురికిని వారసుడు ఒక్క కుర్రవాడే! వాడు పొల ములలో ఆడుకొనుచుండగా, పులి వచ్చి పైబడెను. ఎవ్వరును ఆ బాలుని సహాయమునకు పోలేక పోయిరి.

(6) ఉప్లేటా గ్రామములో ఒక వితంతువు ఏకైకపుత్రుడు, ఇదే విధముగా పులి వాతబడెను.

ఈ బాధ లిబ్లుండ మహారాజుగాని, ఆయన అతిథులుగాని వేటకు బయలుదేరినప్పుడు శిబిరనిర్మాణము మున్నగు కార్య కలాపములకు వందలకొలది గ్రామస్థులను పిలిపింతురు.

ప్రతి గ్రామమును వంతుల ప్రకారము వెట్టి చేయుటకుగాను జట్లు జట్లుగా మనుష్యులను పంపవలెను. ఒకొక్క జట్టులో 10 మంది మొదలు 100 మంది వరకు ఉండుట కద్దు.

ఇక, వేట నిమిత్తము అగు ఖర్చును చూచిన సభ్యతా ప్రపంచము నివ్వెరపడి పోవలనదే! ఏ సామన దగ్గరనో రెండు

రోజుల భాగ్యమునకు శిబిరమును వేసినచో అగు ఖర్చు లక్షల సంఖ్యలోనేగాని, వేల సంఖ్యలో నుండదు. ఈ శిబిరములను చూచినవారు "జాం సాహెబ్ ఘోరారణ్యములో అలకాపురిని సృష్టించును" అని అందురు.

సందర్భము వచ్చినది గనుక కచ్ సంస్థానాధిపతి మృగయా వినోద ప్రియత్వమును గురించి లండన్ "న్యూలీడర్" పత్రిక ఇటీవలనే వ్రాసిన వ్యాఖ్యను ఇక్కడ ఉదహరింతును: "భారతదేశపు ప్రముఖ సంస్థానాధిపతులలో కచ్ మహారాజు ఒకడు. ఇత డనిన బ్రిటిష్ ప్రభుత్వమువారికి చాల అభిమానము; నరేంద్ర మండలిలో ఇతనికి పెద్ద హోదా సయితమున్నది. చిరుతపులులను, అడవిపందులను వేటాడుట ఇతనికి సరదా. ఆఫ్రికానుండి చిరుతపులులను తెప్పించి, వాని నితడు తన సంస్థానపు అడవులలో వదలిపెట్టించినాడు.

"ఆత్మరక్షణ చేసుకొనుటకైనను సరియే కచ్ సంస్థానప్రజలు చిరుతపులులను గాని, అడవిపందులను గాని ఎదిరించుటకు వీలు లేదు. చిరుతపులులు స్త్రీ పురుషులనేమి, బిడ్డలనేమి, మొత్తము 22 మందిని చంపినవి. అడవి పందులు ఇద్దరిని పొట్టను పెట్టుకొనినవి. ఇంతేగాక చిరుతపులులు 42 మందిని, అడవిపందులు 33 మందిని గాయపరిచినవి అయినను మహారాజుగారి దృష్టిలో తన ప్రజల ప్రాణముకంటె ఈ క్రూరమృగముల ప్రాణములకే హెచ్చువిలువ యున్నట్లున్నది!

"అడవి జంతువుల వాతబడిన వారిని గురించిన వివరముల తెలుపు పట్టిక నొకదానిని అఖిలభారత సంస్థాన ప్రజాసంఘము వారు ప్రకటించిరి. ఈ పట్టికలోని విషాదగాథలలో ఇదియొకటి:

35 సంవత్సరముల ప్రాయముగల వ్యక్తి నొకనిని అడవిపంది గాయపరచినది. కేవలము ఆత్మరక్షణ కొరకు అతడు దానిని చంపెను. ఈ ఘోరాపరాధమునకు వేటాడెనను నెపము క్రింద అతనిని అరెస్టు చేసి, రెండు సంవత్సరములపాటు ఖైదులో నుంచిరి. ఇటులనే 40 సంవత్సరముల ఈడుగల ఇంకొకవ్యక్తిని కూడ అరెస్టుచేసి, చావమోదిరి. అతని భార్యను, కుమారుని కూడ ఖైదు చేసిరి.

"భారత కార్మిక కర్షకులు బ్రిటన్ నుండి వచ్చిన నిరంకుశ ప్రభువుల బారినుండి మాత్రమేగాక, స్వదేశీయులైన నిరంకుశ ప్రభువుల బారినుండి కూడ తప్పించుకొనవసి యున్నది. కాని, కచ్ సంస్థానములో క్రూరమృగముల వాత బడినవారిని గురించి సంస్థాన ప్రజాసంఘము వారు ప్రకటించిన పట్టికతో జతపరిచి యున్న మెమొరండంలో చెప్పబడిన రీతిని 'దుష్పరిపాలనను, దౌర్జన్య ప్రయోగమును ప్రతిఘటించుటకు గాను ప్రజల కున్న జన్మహక్కును బ్రిటిష్‌పశుబలము హరించుచున్నది. ఒకరితో ఒకరికి అవసరమున్నది గనుక, బ్రిటిష్ సామ్రాజ్యవాదులును భారత సంస్థానాధీశులును "యునైటెడ్ ఫ్రంట్" ఏర్పాటు చేసుకొనిరి."

"న్యూలీడర్" చేసిన ఈ వ్యాఖ్య—అహో !—ఎంత నిర్భీకముగ నున్నది ! ఎంత సత్యముగనున్నది !! ఎంత...

సిమ్లా శీతలశైలముల కేగినప్పుడు మహారాజులు గంగ కలువు డబ్బునుచూచిన ఎవరికైనను కండ్లు తిరగవలసినదే ! ఆ మధ్య నొక సంస్థానాధిపతి సరిగ నాలుగురోజుల మురిపెమునకు సిమ్లా వెళ్ళెను. అప్పు డతని కైన ఖర్చు లివి :

| | | | |
|---|---|---|---|
| 23 మోటారుకార్లను సంస్థానమునుండి కల్కా-వఱకు తీసికొని వెళ్ళుటకు | ... | రు | 4,300 |
| తిరిగి తెచ్చుటకు | ... | | 4,300 |
| స్పెషల్ సెలూన్ | ... | | 1,050 |
| అనుచరుల రైలుఖర్చులు | ... | | 1,370 |
| 18 సీట్లుగల రైలు మోటారునకు ఖర్చులు (రాను-పోను) | | | 720 |
| హోటల్ | ... | | 4,500 |
| సాదరు | ... | | 7,000 |
| | | మొత్తము రు | 23,240 |

ఒకప్పుడు భారతప్రభుత్వపు అనుజ్ఞ లేనిదే సంస్థానాధిపతులు తమ సరిహద్దును దాటుటకు వీలుండెడిది కాదు. కాని, జర్మనీ యుద్ధానంతరము పరిస్థితులు మారిపోయినవి. ఇప్పుడు సంస్థానాధిపతులు శీతకాలమును కలకత్తాలోను, వేసవిని విదేశముల లోను గడపుచున్నారు. వారి చిత్తముల నాకర్షించుట కున్నవిగదా, కలకత్తాలో గుఱ్ఱపుపందెములును, విదేశములలో......లును !

ఆరోగ్యసంరక్షణార్థమై విదేశములకేగుచుంటి మని సంస్థానాధిపతులు సాధారణముగ తెలుపుచుందురు. విదేశములలో విశృంఖలముగ విలాసలీలల దేలియాడుట ఆరోగ్యసంరక్షణ కొక మార్గ మేమో, ఎవరి కెఱుక !!

మితవాద శిఖామణి యైన శ్రీనివాసశాస్త్రిగారి సంశయాస్పదములుకాని పలుకు లివి: "సంస్థానాధిపతులలో అధికసంఖ్యాకులు వారి రాజ్యమందిరములలో గాన్పింపరు. * * * ప్రజావిత్తముతో భోగముల ననుభవింప వీలగు పరదేశములలో నెల్లవారు పొడగట్టుదురు. లండను, పారిస్,— వేయేల?— విలాసకేంద్రమైన ప్రతినగరములోను యూరపియనులను దిగ్భ్రమ నొందించుచు, దగ్గర చేరినవారిని కళంకపరచుచు ఎవడైన నొక సంస్థానాధిపతి తప్పక కాన్పించును."

విదేశములలో నున్నప్పుడు వీరు రూపాయులను చిల్లపెంకులవలె వాడుదురు ఒక సంస్థానాధిపతి — అందును సామాన్య సంస్థానాధిపతి— లండనులో ముచ్చటగ మూడువారము లుండి కేవలము కాంతలకొఱకు 6 వేల పౌండ్లను వెచ్చించుట గాబా గారు స్వయముగా ఎఱుగుదురట !

కొలనల్ పొవెల్ వ్రాసిన విషయము లివి: "సెయింట్ జర్మన్ వద్ద నొక భారతసంస్థానాధిపతి నివసించుచుండును. ఇతని పొరుగుననే పురాతన ఫ్రెంచి రాజవంశమునకు జెందినవారు కొందరు కాపురమున్నారు. ఇతని వైభవము

ముందు వారు గంజికి గతిలేనివారివలె కాన్పింతురు పారిస్ నగరమునకేగినప్పుడిత డిచ్చు విందులు ఆ ఫ్రెంచి రాజధాని నగరమునే చకితమొనర్చును. మఱియొక సంస్థానాధీశునికి ఒక్క ఫ్రాన్సులోనే ఆరు పందెపుగుఱ్ఱముల శాలలును, స్కాట్లెండులో వేట కేగినప్పుడు విడిది దిగుట కొక భవనమును, పారిస్‌లో ఒక విశాలరాజమందిరమును కలవు ఇంకొక మహారాజు మాంటే కార్లోలో నున్న 'ఇంటర్ నేషనల్ స్పోర్టింగ్ క్లబ్'లో జూద మాడుచు, ఒక్క రోజులో పది లక్షల ఫ్రాంకులను ఓడిపోయెను! (ఫ్రాంకు = 10 అణాలు.)

ఇట్లే మఱి పెక్కు గాథలను పేర్కొనవచ్చును. కాని, విషయ మిప్పటికే విస్తరించుటవలన సంస్థానాధిపతుల దుర్వ్యయమునుగూర్చి కొందరు ప్రముఖులొసగిన అభిప్రాయములను మాత్రము పేర్కొని, ఈ ప్రకరణము నింతటితో ముగింతును. ఒక సంస్థానాధీశుని దివ్యహర్మ్యములో సుఖాసీనుడై మాంటేగ్యూ: "సిగరెట్టు కేసులు మోటారు కార్లు వాయు విమానములు మున్నగువాని ఆకారములతో అన్ని యెడల నున్నవి. కొన్ని కేసులకు సిగరెట్టులను పైకి తీసియిచ్చు కొంగలుకూడ అమర్చబడియున్నవి. డైనింగ్ టేబులుమీద విద్యుచ్ఛక్తిచే నడుపబడు జలయంత్రము (Fountain) కలదు. పాశ్చాత్యనగర వీథులలో ఇట్టివిలాసవస్తువులను గాంచినప్పుడు, వీని నన్నిటి నెవరు కొందురా యని తలచుగ నాశ్చర్యము

గలుగు చుండెడిది. తుద కీవిమున్నియు సంస్థానాధీశులను జేరు
నని యివ్వా డనుకొనవలసివచ్చుచున్నది."

విఖ్యాత గ్రంథరచయిత గాబా; "ఎంతో మంది సంస్థానాధి
పతులవద్ద డజనులకొలది 'రోల్సు రాయిస్' కార్లు కలవు.
ఈ కారు ఒక్కొక్కటియు 50 వేల రూప్యములకు పైగా
విలువచేయును డెర్బీ పందెములలో గెలుపొందిన గుఱ్ఱము
లను కొనుటలో భారత సంస్థానాధీశ్వరులదే ముందడుగు.
ఇట్టి గుఱ్ఱములలో ఒకదానిని లక్షపొండ్లకు ఒక మహారాజు
బేర మాడిన సంగతి ప్రఖ్యాత విషయమేగదా! ఎందరో
తమకు నచ్చిన లండను, పారిస్ నగరముల గాయకురాండ్ర
సాహచర్యముతో చలిబాధను బాపు కొనుచుందురు.
(మాతృకలోని వాక్య మిది—Not a few have their
beds warmed by their pick of the music halls
of London and Paris. విదేశములలో వలెనే స్వదేశమును
కూడ! కోర్కెలకు మితమే లేదు. పదకొండు "హెడ్
లైట్సు" గల కార్లు; వెండి బంగారు రేకుల కార్లు; గంటకు
నూరుమైళ్ళు పరుగెత్తు కార్లు; స్త్రీలతో కోరిన సరసములాడు
టకు తగిన కార్లు; * * ఇక స్త్రీలా? సృష్టిలో కెల్ల సుంద
రాంగులే!—నీలినేత్రములు గల పొడగరి ఉత్తరాది కోమలాం
గులు; సుగంధముల ప్రసరించు కుంతలములు గల దక్షిణాది
లతాంగులు; సువర్ణ శరీరచ్ఛాయలతో సమ్మోహన మొన

రించు 'కులు' యువతీమణులు, మధురాధరములును, నల్లత్రాచు లను బోలు వేణీబంధమునుగల కాశ్మీరదేశపు స్త్రీలు! వీ రందరును రాణులు కానక్కరలేదు. కాని, వీరు మహారాజు జీవితములో అంతర్భాగము లగుదురు జీవితము నానందమయ మొనర్తురు, వీరు!"

సిమ్లాలో జరిగిన పంజాబుసంస్థానప్రజాసభా అధ్యక్షోపన్యా సములో థక్కర్: "సంస్థానధనము భోగాతిశయములకు, మృగయా వినోదమునకు, యూరపియనుల విందులకు వెచ్చింప బడుటయేగాక భోగకన్యలకు, యూరపు—అమెరికా ఖండ ముల పర్యటనములకు తగులవేయబడుచున్నదని సంస్థాన ప్రజల్ గోలపెట్టుచున్నారు. పెక్కు సందర్భములలో సంస్థా నాదాయములో సగమునకుపైగా మహారాజుగారి క్రిందను, వారి కుటుంబము క్రిందను చెల్లిపోవుచున్నది. ఇందుచే జాతీ యాభివృద్ధికి దోహదమొనర్చు విద్యాశాఖ, ఆరోగ్యశాఖ, శౌచశాఖ మున్నగువానికి ధనము స్వల్పముగ మాత్రమే మిగులుచున్నది. ప్రజలనుండి శిస్తుల రూపముగ గైకొని డబ్బు ఏదో యొక రూపమున వారికి తిరిగి చేరుటకు బదులు స్తుతిపరాయణులు, హోటల్ కీపర్లు, లండను - పారిస్ నగర ముల షర్పిచరు వర్తకులు మున్నగువారి జేబులలో పడు చున్నది.

" సంస్థానాధిపతుల సొంతఖర్చును ఏ మాయమంత్రము చేత నైన సంస్థానవు రాబడిలో నూటికి పది పాళ్ళకే నియమించి, దానికి తగిన పరీశీలనమును, ఆడిటును ఏర్పాటు చేసినచో దుష్పరిపాలనము సగము తగ్గిపోగలదు. దుర్వ్యయముకూడ చాలవఱకు ఆగిపోగలదు. ఇటీవలనే పాటియాలాసంస్థానము వారు మూడుకోట్ల రూపాయలు ఋణము చేసినట్లు తెలియు చున్నది. ఇట్టిఋణమును తీర్చుటకు పూర్వోక్తమైన పంథా తప్ప వేఱు మార్గము లేదు.

కాని, ఏది ఆ మాయ మంత్రము!

# శాసనసభలు

రామనారాయణ చౌదరిగారు రాజపుత్రస్థానసంస్థానములను గూర్చి చక్కని వ్యాసము నొకదానిని వ్రాసిరి. దానిని 1928-వ సంవత్సరము డిసెంబరు నెల 'మాడరన్‌రివ్యూ' సంచికలో రామానంద ఛటర్జీగారు ప్రకటించిరి. వ్యాసరచయితయు, ప్రచురణ కర్తయు సుప్రసిద్ధులే! ఆ వ్యాసములోనివే, ఈ క్రింది వాక్యములు:

"రాజపుత్రస్థానములోని 21 సంస్థానము లందున బ్రిటిషు వారి పాలనావిధానము పారంపర్యముగా వచ్చుచున్న నిరంకుశత్వమే. ఒక్క బికనీరులో దక్క మరి యే యితర సంస్థానమునందును శాసనసభ లేదు. * * * తక్కిన సంస్థానము లన్నిటియందును ప్రబల యనుమతిని శాసనము లొనర్చు పద్ధతి నటనమైనను లేదు. సంస్థానపతి మాటయే శాసనము. కార్యనిర్వాహకుల యుత్తరువులకును, 'లా' కును భేద మే మాత్రమును లేదు. చకాపికీగా నుత్తరువులను జారీచేయుచుందురు. వాని నప్పుడప్పుడు స్టేటుగెజెట్టులో బ్రచురించుచుందురు. అదియును 'గెజెట్టు' ఉన్న చోట్లమాత్రమే! ఏదో

రియొక్క కార్యమును నేరముగా బరిగణించి మహారాజావారి సంత కముతో శాశ్వతుమవచ్చును. దానికి తగిన శిక్ష అందే విధింప బడి యుండును. ఎవడో యొక్క యుద్యోగికి ఆయాజ్ఞను నిర్వహించుటకు అధికార మొసగబడును. సివిలు, క్రిమినలు కోర్టులకు కొన్ని అధికారములను తగ్గించి, వానిని కార్య నిర్వాహకోద్యోగుల కిచ్చుచు ఉత్తరువులు జారీచేయబడుచుండును కూడ. విచారణ లేకుండ ప్రజలను దేశమునుండి వెడలగొట్టుట, వార్తాపత్రికలను ఆపిచేయుట, ఆస్తిని స్వాధీనము చేసికొనుట, ఇట్టివి సామాన్యముగ జరుచునే యుండును.

రాజపుత్ర సంస్థానములవలెనే తక్కినవియు! భారత వర్షమున మొత్తము 563 సంస్థానము లున్నవి. వీనిలో 108 ప్రథమ శ్రేణిలోనివి. బట్లరు కమిటీ నివేదిక (15 వ పేజీ) వలన పై 108 సంస్థానములలో కేవలము 30 మాత్రము శాసనసభలను ఏర్పరచినట్లు తెలియవచ్చుచున్నది. ఈ శాసనసభలైనను వట్టి సంప్రదింపు కొఱకే నట! రాజకీయ పరిభాషలో 'ప్రదర్శనము' అను పదమునకు 'సంప్రదింపు' అను దానిని ఉపయోగించుట పరిపాటి కాబోలు!

అసలు, ఉన్న శాసన సభలే తక్కువ. ఆ తక్కువలోను చాలభాగము బూటకములు. ఉదాహరణముగ బికనీరు శాసన సభనే తీసికొనుడు.

ఈ శాసనసభలో మొత్తము 45 మంది సభ్యులున్నారు. వీరిలో 27 మంది క్రిందివిధముగ నామినేట్ అయినవారు :

19 మంది అధికారులు
8 మంది అనధికారులు
27

పోగా మిగిలిన 18 మంది సభ్యులును క్రింద చూపిన రీతిని ఎన్నిక అయినవారు :

12 మంది పురపాలకసంఘముల ప్రతినిధులు
3 గురు సర్దారులు
3 గురు జమీందారులు
18

సంస్థానములో మొత్తము 15 పురపాలకా సంఘము లున్నవి. వీనిలో 10 సంఘము లందు సభ్యు లందరును నామినేట్ అయిన వారే! మిగిలిన అయిదింటిలో నైనను ఎన్నికమీాద వచ్చిన సభ్యులకంటె నామినేషన్ వలన వచ్చిన వారే అధిక సంఖ్యాకులు. ఇందువలన పురపాలక సంఘముల తరఫున సంస్థాన శాసనసభకు ప్రతినిధులుగా వచ్చువారిని ఎన్నిక పొందిన సభ్యు లనుటకంటె, నామినేటెడ్ జోహుకుము లనుట సమంజసము.

సర్దారుల ప్రతినిధుల విషయములో నేమి, జమీందారుల ప్రతినిధుల విషయములోనేమి, సరిగా ఇదే తంతు జరుగుచున్నది. ఈ ఉభయవర్గములవారికిని సంస్థానము పూర్తినామినేషన్ పద్ధతి మీద వేర్వేరుగా సంఘముల నేర్పరచినది. ఆ సంఘములు పంపునట్టి ప్రతినిధులు నామినేటెడ్ జోహుకుములు కారా? ఈ విధముగ బికనీరు శాసనసభ పూర్తిగా నామినేటెడ్ సంస్థ. ఎన్నిక అయిన సభ్యులు నామినేషన్ పొందిన సభ్యులు అని దానిలో పైకి కనబడు విభేదము కేవలము బూటకము. ఇట్టి ఘోర పరిస్థితిలో ప్రజాభిప్రాయప్రకటనమునకు అవకాశమెక్కడ? ప్రజాభీష్టసిద్ధికి తరణోపాయమేది?

ఈ బికనీరు శాసనసభ 1929-వ సంవత్సరము ఏప్రిల్ 15, 16 తేదీలలో ఒకసారి సమావేశ మయ్యెను.

ఆ రెండురోజులలోనే బడ్జెటును చర్చించుట, దానిని 'పాస్' చేయుట, సభ్యుల ప్రశ్నలన్నిటికిని ప్రత్యుత్తర మొసగుట, పెక్కు చట్టములను, తీర్మానములను ఆమోదించుట— వేయేల? వార్షిక కార్యకలాప మంతయు పూర్తియయ్యెను. శాసనసభా కార్యకలాప నిర్వహణములో ఇది 'వరల్డు రికార్డు!' భూజలాకాశతలముల శరవేగమున ప్రయాణమొనర్చుటలో 'వరల్డు రికార్డు!' తమవే యని బ్రిటిషువారు గర్వింతురు. మనకును మూడు 'వరల్డు రికార్డ్సు' లేకపోలేదు. మల్లయుద్ధమున సర్వ ప్రపంచమును గెలిచిన గామా మనవాడే! హాకీ ఆటలో

సమస్తదేశముల నోడించినజట్టు మనదే! ఇక రెండురోజులలో యావద్వత్సర కార్యకలాపమును బహు సులభముగ ముగించిన శాసనసభయు మన దేశములోనిదే!

ఈ రెండు రోజులలో బికనీరు శాసనసభ చేసినపని ఇది:

మొత్తము వార్షికాదాయములో నూటికి షుమారు $3\frac{1}{2}$ పాళ్ళను ప్రజోపయోగశాఖల కొసగుట! మహారాజుగారి స్వంతఖర్చులకు షుమారు $22\frac{1}{2}$ పాళ్ళు నిచ్చుట!! ప్రజాశ్రేయమన్న ఎంత అభిమానమో చూచితిరా!!!

ఇంతకంటె విపరీతమైనది నవానగరు శాసనసభ. 1919 లో ఆళ్వారు మహారాజు ఈ సంస్థానమునకు అతిథిగా వచ్చెను. ఆ సందర్భములో అప్పటి జాం సాహెబ్ సలహాసంఘము నొకదానిని యేర్పాటు చేయవలసినదిగా ఉత్తరువు చేసి, ఆసంఘసభ్యులుగా కొందరు పెద్దలను నామినేట్ చేసెను. వెను వెంటనే ఆ సలహాసంఘసభ జరిగెను. జాంసాహెబ్ సభను ప్రారంభించుచు ఉపన్యసించెను; ఆళ్వారు మహారాజు కూడ దానిలో తన వాక్చాతుర్యములు ప్రదర్శించెను. అంతే! తిరిగి ఆ సంఘము ఎన్నడును కూడలేదు. తిరిగి దాని ఊసు ఎత్తిన వారే లేరు. అయినను తమ సంస్థానములో ఏదో ఒక శాసనసభ యున్నట్లే నవానగరు జాంసాహెబ్ నటించు చుండును!

తదితర సంస్థానములలో గూడ ఇదే నటన! మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానములలో గాక మఱి ఏ రెండింటిలోనో, మూడింటిలోనో ప్రజాభిప్రాయప్రకటనకు వీలైన శాసనసభ లున్నవి. మిగిలిన వన్నియు ప్రపంచమును మోసపుచ్చుటకు ఏర్పరుపబడినవే!

అన్నట్లు వీనివలన ఒక లాభము లేకపోలేదు. మహారాజులు ప్రపంచ పరిస్థితులను గూర్చియు, బ్రిటిషుయిండియా రాజకీయ వ్యవహారములను గూర్చియు గంభీరోపన్యాసము లొనగుటకు— ఆ యుపన్యాసములను వారితరులచే వ్రాయించుకొందురనుట పొరపాటు! — ఈ శాసనసభారంగములు చక్కగ ఉపయోగించును!

పెక్కు సంస్థానములలో శాసనసభలే లేవుగాని, శాసనములకు మాత్రముకొఱత లేదు. వాక్స్వాతంత్ర్యమును హరించు శాసనములు, సభలను నిషేధించు శాసనములు, పత్రికలను నిర్బంధించు శాసనములు, ఆస్తినివశపరచుకొను శాసనములు, ఫిర్యాదు విచారణలు లేకుండ కారాగారమున బడవేయు శాసనములు,— ఇట్లే పెక్కు లున్నవి. దీనిలో అత్యుక్తి లేదు, అణుమాత్రమైన!

“రాజు తలచిన దెబ్బలకు కొదువా?” అను సామెతను ఊబుసుపోక చెప్పిరా మఱి?

# సంస్థానోద్యోగులు

సంస్థానాధిపతి తరువాత అంతటివాడు దివాను. కనుక అధిపతి యెట్టివాడైనను, దివాను మంచివాడైనచో అంత ఇబ్బందిలేదు. కాని, మన సంస్థానాధీశులకు—అదేమి పాప కర్మమోగాని—వారికన్న రెండాకులెక్కువ చదివిన దివానులే దొరకుచున్నారు!

దొరకుచున్నా రంటివా? ఇది పొరపాటే! కావలె ననియే సంస్థానాధిపతులు ఇట్టి దివానులను నియమించుకొనుచున్నారు. కానిచో, వారు ఆడిన దెల్ల ఆటగాను, పాడిన దెల్ల పాటగాను సాగు టెట్లు!

ఈ దివానుల నియామకమునుగూర్చి చూడ్గర్ ఇట్లు వ్రాసెను:

"విద్యనుగాని, సామర్థ్యమునుగాని, అనుభవమునుగాని పూర్తిగ విచారింపకయే దివానును సాధారణముగ సిఫార్సుల మీద నియమించుచుందురు. అతనికి అసలు విద్యావైదగ్ధ్యముగాని, పరిపాలనానుభవముగాని ముఖ్యావసర మనియే యెంచరు."

ఈ రీతిగ నియమితుడైన దివాను తదనుగుణముగనే వర్తించు చుండును. అతని వర్తననుగూర్చి చూడ్గర్ ఇట్లు వ్రాసెను :
"దీప ముండగనే ఇంటిని జక్కబెట్టుకొనుటయందు దివాను నిమగ్నుడై యుండును. * * * విలాసములకును, డాంబికము లకును సంస్థానపతిని విచ్చలవిడిగ వెచ్చింప నీయుటయే గాక, ఆతనిని విశృంఖల వ్యభిచార పథమునుండి తప్పించుటకైనను సాధారణముగ యత్నింపడు."

ఒకవేళ ప్రజాక్షేమమునే ప్రధానముగా నెంచు సత్పురుషు డెవడైన – పౌరపాటుననో, గ్రహపాటుననో – దివానుగా నియమింపబడినను, అతడు పట్టుమని పది రోజులు పని చేయక మునుపే రాజీనామా నియ్యవలసివచ్చును. 'నా ఊహాగానము' కా దిది. క్రింది విషయములే నా పలుకులకు నిదర్శనములు :

బొంబాయి హైకోర్టు జడ్జీగా కొంతకాలము పనిచేసిన సర్ యన్. జి. చాంద్వార్కార్‌గారు (ఉపకారవేతనమును పొందిన నంతనే) ఇందూరు సంస్థానమునకు దివానుగా నియమితులైరి. కాని, తుకోజీరావు హోల్కారుగారి విలాసవిభ్రమములు దుర్భర మగుటచే వీరు సంవత్సరమైనను నిండకమునుపే తమ పదవిని త్యజించిరి.

రాజ ప్రతినిధి కార్యనిర్వాహక వర్గములో సభ్యులుగా నుండి, పేరు ప్రతిష్ఠల నందిన సర్ ఆలీ ఇమాంగారు హైదరాబాదు

సంస్థానములో దివానుగా పని చేయుటకు అంగీకరించిరి. కాని, వారు చాలకాలము తమ పదవిలో నిలువలేదు.

సర్ ఆల్ బియన్ బెనర్జిగారు మొదట మైసూరు సంస్థానమునకు దివానుగా పనిచేసి, ఫించను పుచ్చుకొనిరి. పిదప వారు కాశ్మీరులో దివానుగా ప్రవేశించిరి. కాని 18 మాసములు తిరుగునరికే సెలవు పుచ్చుకొనిరి.

దీని తాత్పర్య మేమి? శక్తిసామర్థ్యములు గలవాడును, ప్రజాక్షేమమును కాంక్షించువాడును దివానుగా పని చేయుట కష్టమనియే గదా! ఇక పని చేయగలవా డెవడు? స్తుతిపరాయణుడు, స్వార్థపరుడు, పాపభయవిరహితుడు...

దివానులే ఇట్లుండ, తదితర సంస్థానోద్యోగుల సంగతి వేఱుగ జెప్పవలెనా?

కొన్ని సంస్థానములలో ఉద్యోగము కోరినను, ప్రమోషన్ అపేక్షించినను సంస్థానోద్యోగులు తమ భార్యలను మహారాజునకుగాని, దివానునకుగాని తార్చవలసియుండునని గాబా వ్రాయుచున్నాడు. నిరాధారముగ నత డిట్లు వ్రాయలేదు. ఇందులకు నిదర్శనము వలయునేని 'ప్రిన్సిలీ యిండియా' పత్రికలో (1929_1_15 వ తేదీని) సంస్థానోద్యోగి యొకడు స్వకీయానుభవమును దెలుపుచు ప్రకటించిన క్రింది వాక్యములను చిత్తగింపుడు:

"మహారాజునకు స్త్రీలను తార్చుటలోనే సంస్థానోద్యోగు లందరును నిమగ్నులై యుందురు. నేను కొంతకాల మాతనివద్ద కొలువుంటిని. నా తోడి యుద్యోగులవలె నేను కూడ చేయవలసివచ్చినప్పుడు అసహ్యముతో నేను రాజీ నామా నియ్యవలసివచ్చెను. * * * మహారాజు స్వయ ముగ దివానుపేర వ్రాసిన ఈ లేఖను ప్రకటించవలసినదిగ 'ప్రిన్సిలీ యిండియా' సంపాదకుని కోరుచున్నాను. దీనివలన పూర్వోక్తములైన నావలుకులు సత్యము లని తెలియగలదు.

రాణ్మందిరము.

..........

28—9—1928.

'ప్రియమైన......గారికి,

మీరు వ్రాసిన లేఖయు, సెలవు దరఖాస్తును చేరినవి. మీరు కోరిన సెలవు నిచ్చితిని. కాని మీరు సాధ్యమైనంత త్వరలో తిరిగి రావలెను. మీ లేఖలో ఉల్లేఖించిన ఇద్దరిని తేవలెను. వారు చాల అందముగా నుండవలెను. నాకు నచ్చినవారిని తేగ లిగినచో మీరు నా విశ్వాసపాత్రులైన సేవకులని భావింతును.

విశ్వాసపాత్రుడు,
(సం) రాజా సాహెబు.'

స్థితిగతులు ఎంత ఘోరముగ నున్నవో చూచితిరా? తనకు నచ్చినవారిని తార్చిన విశ్వాసపాత్రుడైన సేవకు

డగునట! లేనిచో కా డట!! తుదకు తార్పుడు విశ్వాసా విశ్వాసములను నిర్ణయించు కొలబద్దయైనది!!! ఇందువలననే గాబా "పెక్కు సంస్థానములలో పైకి వచ్చుటకుగాను మహా రాజునకు ఎవతెనైన తార్చుటయే తిరుగులేని మార్గము. కన్యయైన ఉత్తమము. కాని, అందగత్తెయైన ఏ స్త్రీయైనను చాలును" అని వ్రాయ సాహసించెను.

ఈ తార్పుడు వ్యాపారములో సంస్థానోద్యోగులు ఎట్టి ఘాతుకకృత్యములకైన సమకట్టుదురు. అ దేదో సంస్థానాధి పతి సాధారణసైనికు నొకనిని సర్దారుపదవి కొక్క సారిగా లేవనెత్తె నట. చెడి బ్రతికిన వీనికి అధికారప్రాబల్యము చిక్కినంతనే స్త్రీలు తమ మానాభిమానములను కాపాడు కొనుటయే దుర్ఘట మయ్యెనట. ఒకనాడు మహారాజుదృష్టి ఒక గృహిణిపై బడెనట. క్రొత్త సర్దా రామెను మహా రాజునకు సమకూర్చుటకై వెంటనే బయలుదేరెనట. చీకటి మరుగున ఆమె భర్తను అతడు వధించెనట. సమీపముననే ఆయత్తమై యున్న మోటారుకారులో నామెను రాజప్రాసా దమునకు యెత్తుకొనిపోయెనట. ఆ సాధ్వీలలామ మహారాజు కోర్కెను ధిక్కరించెనట. అందుచే మొదట పదిమంది ఆమెను మానభంగ మొనర్చిరట. పిదప ఆమెకుత్తుకనే యుత్త రించిరట. ఇది తగని పని యని మందలించిన యొక మంత్రి తన యుద్యోగమునకు నీళ్ళు వదలుకొనవలసిన వచ్చెనట!

ఇది పట్టి పుక్కిటి పురాణము కాదు. గాంధా వ్రాసి, ప్రక
టించిన విషయము !

ఇట్లే యున్నవి మఱి యెన్నో దుష్కృత్యములు! కాని, వానిని
పేర్కొనుటకు నా కసహ్యము కలుగుచున్నది !! అబ్బ! అవి
యెంత అశ్లీలములు, అసభ్యములు, అమానుషములు ...

# న్యాయవిచారణ

ఇందూరు సంస్థానములో న్యాయవిచారణ: శంకర ప్రసాద దూబే ఇందూరు నగరములోని బండ్ల కార్ఖానా ఖామందు. ఇతడు 16 సంవత్సరములు లాభసాటిగ వ్యాపారము చేసెను. ఇతని కార్ఖానాలోనే సంస్థానపుబండ్లుకూడ చాల చేయించ బడెను. ఇట్లుండ హఠాత్తుగ 1920 వ సంవత్సరము అక్టోబరు 8 వ తేదీని పోలీసు సూపరింటెండెంటు కొందరు భటులతో పాటు దూబే ఇంటికి వచ్చి, మహారాజుగారి ఆజ్ఞ ప్రకారము దూబే కుటుంబపు స్థిరాస్థియంతయు జప్తుచేసితిననియు, రెండు గంటలలో అతడు ఆ స్తిని స్వాధీనము గావింపవలెననియు మూజు వాణీగా చెప్పెను. పిమ్మట నెలదినములకు ఎప్పుడో శంకర ప్రసాదదూబే సోదరు లిద్దరు సంస్థానమునెడ ద్రోహముగ వర్తించిరనియు, వారిని సన్మార్గమున బెట్టుటకు చేసినప్రయత్న ములు విఫలమయ్యెననియు, అందుచే దూబేకుటుంబపు ఆస్తి యంతయు జప్తుగావింపబడె ననియు 'గెజెట్టు' లో ప్రకటిం చిరి. శంకర ప్రసాదదూబే స్వయముగ ద్రోహకరముగ వర్తించెనని 'గెజెట్టు' లో పేర్కొ-నలేదు. ఐనను అతని సోదరు

లిద్దరు తనకు ద్రోహచింత నొనర్చిరని యూహించి, మహారాజు కుటుంబ మొత్తపు ఆస్తిని పూర్తిగ జప్తుచేసెను! ఈవిషయమై దూబేకుటుంబీకులు భారతప్రభుత్వమువారికి విజ్ఞప్తిని పంపుకొనిరి. కాని, అది బుట్టదాఖలై పోయెను!

ఈసంస్థానములోని న్యాయపరిపాలనకే మఱొక ఉదాహరణము: ఇందూరు సంస్థానమునకు పారంపర్యముగ వచ్చుచున్న దివానులు కొందరున్నారు. ఈ దివానులలో ఒకడు సుందరాబాయి అను బాలికను వివాహమాడెను. వానికి మూర్ఛ కలదు. ఏమూర్ఛరోగియు వివాహమాడుట తగదట. అందుచే మహారాజుగారు అతని పెండ్లిని రద్దుచేసిరి. పోనీ, రద్దుచేసినవా రంతటితో ఊరుకొనిరా? లేదు! తిరిగి అతనికి వెంటనే వేఱొక వివాహమును చేయించుటయేగాక, 20 సంవత్సరములు ప్రాయముగల బాలునొకనిని దత్తత యిప్పించిరి. దీనిని గాంచి పాప మా సుందరాబాయి భారతప్రభుత్వమువారికి న్యాయము దయచేయుడనుచు విజ్ఞప్తిని పంపుకొనెను. కాని, ఆమెప్రార్థన వృథాయయ్యెను. ప్రజలును, పత్రికలును ఆమెయెడ సానుభూతిని ప్రకటించినవి. కాని, లాభ మేమి? ఆ బాలిక రాజప్రతినిధికి పంపిన విజ్ఞప్తిలోని క్రిందివాక్యములు గమనార్హములు: “ మహారాజుగారు నాకు చేసిన అన్యాయమును బ్రిటిషుసామ్రాజ్యములో మరెవ్వరును చేయజాలరు. బ్రిటిషుసైన్యమే గదా మహారాజుగారిని సింహాసనముపై కూర్చుండబెట్టుచున్నది. ఈ రక్షణను

తొలగించినచో, ఇందూరు ప్రజలు వారము దినములలో న్యాయాన్యాయములను తెల్సుకొనగలరు. ''

బికనీరు సంస్థానములోని న్యాయపాలనము: జయంతి ప్రసాద పానే దాన్ గారిని అరెస్టు చేసి, విచారణ లేకుండ గనే రెండేండ్లు కారాగారములో నుంచిరి. మహారాజుగారికి అంగరక్షకుడుగా పనిచేయ నిరాకరించినందులకు నారాయణ సింగును దేశభ్రష్టుని గావించిరి. "అనుజ్ఞ లేకుండగనే సభను జరిపి" రను కుట్రనేరముపై గంగాప్రసాదుగారిని సంస్థా నమునుండి బహిష్కరించిరి. బికనీరు రైల్వే ఆడిట్ డిపార్టు మెంటు పనిచేయుచున్న రాధాకృష్ణ టోస్నివాల్ గారిని అయిదు గంటలలో సంస్థానమునుండి వెడలి పొమ్మనిరి. అకారణ ముగ జమ్నాలాల్ బజాజుగారిని, వారి అనుచరులను పట్టు కొని బికనీరు సరిహద్దు వెలుపల వదలిపెట్టిరి. 1966-67 సంవ త్సరములో రైతులకు విక్రయించిన భూములలో పైకెంటిని యిటీవలనే లాగికొనిరి. జర్మన్ యుద్ధసమయమున సమకూ ర్చిన సైనికులకు ఈనాముగా నిచ్చిన పొలములను, తర్వాత జప్తుచేసిరి. రతన్ బాచార్ జీ దేవాలయపు గ్రామ ములను బలవంతముగ స్వాధీనపఱచుకొనిరి. ఇట్లే మరి యెన్నో విషయములు మొన్న మొన్ననే భారత సంస్థాన ప్రజాసమితివారిచే ప్రకటింపబడిన (An Inside View of

the State of Bikaneer) అను గ్రంథములో పేర్కొనబడి నవి. వాని నన్నిటిని ఇట ఏకరువు బెట్ట నేల?

జాంనగరు సంస్థానములోని న్యాయదక్షత: మానసింహ ఝాంగారిని అరెస్టుచేసి, విచారణ లేకుండగనే అయిదు సంవత్సరములు చెరసాలలో నుంచిరి. లాల్‌పూరు నివాసులైన మాల్జీనాగ్జీగారిని అరెస్టుచేసి, ఫిర్యాదు, విచారణలు లేకుండగనే మూడు సంవత్సరములు బందిఖానాలో నుంచిరి. వారి రక్షణ నిమిత్తమె వెళ్ళిన సోదరునికూడా కారాగారమున పడవేసిరి అరుణ జాగీరుదారుని సేవకులలో షుమారు 50 మందిని ఒక్కసారిగా అరెస్టుచేసి, సంవత్సరముపాటు చెఱసాలలో నుంచి, నానాహింసలను పెట్టిరి. అగ్గిపెట్టెలు, కిరసనాయిలు మున్నగు దైనందిన జీవితావశ్యకములను ఇజారాపాడకూడ*దని విజ్ఞప్తిని పంపిన లవణ ప్రసాదుగారిని వెంటనే పట్టుకొని, 45 దినములు నిర్బంధములో నుంచిరి. ఈ 45 దినముల పిదపనైనను న్యాయ మనిగాక, కేవలము "దయ తలచియే" మహారాజుగారు వదలిపెట్టిరట!

ఇట్లే ఆళ్వారు, పాటియాలా, కాశ్మీరు, రాంపూరు...

ఇంతకన్న న్యాయవిచారణను గూర్చి వ్రాయవలసినదియు, వ్రాయుదగినదియు లేదు. ఇక పేర్కొనిన, చూడ్గర్, సంస్థానములలోని పోలీసుశాఖనుగూర్చి వ్రాసిన వాక్యములనే పేర్కొనవలసియున్నది. ఆ వాక్యము లివి:

"దాదాపు నూటికి 50 నేరములకు ఆచోకీయే దొరకదు చోరీ సొత్తులో నూటికి 30 వంతులైనను పట్టుకొనబడదు. హత్యానేరములలో నిజమైన నేరస్థుడు కనీసము ఒక్కడైనను శిక్షింపబడడు. పాపపుణ్యము లెరుగనివారు తప్పుడు సాక్ష్యముపై శిక్షింపబడుదురు. * * * పెక్కు సందర్భములలో పోలీసువారే నేరములను పురికొల్పుదురు. పేరెన్నికగన్న నేరగాండ్రను దొంగతనములు గావింప నియమించి చోరీసొత్తులో వారు భాగము పంచుకొనుచుందురు. * * * గ్రామములలో రూపవతులైన మహిళామణుల మానరక్షణ జరుగుట దుస్సాధ్యము !!" *

---

* సంస్థానములలో పోలీసుశాఖ ఏస్థితిలోనుండునో తెలుపుటకు క్రింది కథ చక్కగ ఉపకరించును: రాజపుత్రస్థానములోని ఒక సంస్థానములో మహారాణి పూజావిగ్రహము వీధివెంట పోవుచుండగా దర్జీవాడొకడు పరధ్యానముగానుండి లేచినిలబడలేదు. వెంటనే అతనిని మహారాణీ సేవకులు అరెస్టుచేసి, తీసుకువెళ్ళిరి. తర్వాత రెండుమూడు రోజులు గడచినను, అతడిగతి ఏమయ్యెనో తెలియలేదు అంతట అతడి బంధువులు పోలీసు శాఖాధికారి దగ్గరికి వెళ్ళి మొరపెట్టుకొనగా, "మహారాణీగారి సేవకులు నాపోలీసులనే అరెస్టుచేయుదురు; ఇది ఒక లెక్కయా ?" అనెను.

# పన్నులు

ఈ ప్రకరణమును చూడ్గర్ వ్రాసిన వాక్యములతో ప్రారంభించుట మంచిది: "సంస్థాన పరిపాలనావశ్యకత ననుసరించి పన్ను లుండవు. సంస్థానము కల్పించు సౌకర్యములకు గాను వ్రజలు చెల్లింపవలసిన మొత్తములుగా కూడ వానిని పరిగణింప వీలులేదు. పన్నుల ప్రాతిపదికను విశద మొనర్చుటకు గాని, సమర్థించుటకుగాని వలను పడదు. అస లట్లు గావింపవలసిన అగత్యమే లేదు. తాను విధించు పన్నులను విశదమొనర్పవలసినట్టియు, సమర్థింపవలసినట్టియు బాధ్యత సంస్థానాధీశునికే లేదు. అతడు నిరంకుశాధికారి. తదితర విషయములలోవలె పన్నులను విధించుటలోగూడ అతడు తన చిత్తము వచ్చినట్లు చేయగలడు.

సంస్థానాధిపతికి చిత్తము వచ్చినట్లు పన్నులను విధించు అధికార మున్నప్పుడు తక్కిన పరిస్థితులు ఊహ్యములే యనుకొనుటకు వీలు లేదు. కొన్ని సంస్థానములలో ఊహాతీతమైన స్థితియందున్నవి, పరిస్థితులు. ఉదాహరణముగ నవానగరు సంస్థానమును గైకొనుడు.

ఆ సంస్థానము విధించుచున్న పన్ను లివి :

వ్యవసాయదారులు చెల్లింపవలసినవి :

భూమిశిస్తు
ఆస్తిహక్కు-పన్ను (భూమిశిస్తు మొత్తములో రు 1-0-0 కి 0-4-0 చొప్పున)
కరవుపన్ను (భూమిశిస్తు మొత్తములో 1-0-0 కి 0-4-0 చొప్పున)
కరవు భీమాపన్ను
పాడిపశువుల పన్ను
పశువిక్రియము పన్ను
పశుగ్రాసము పన్ను
నేతి పన్ను
ప్రత్తి పన్ను
ధాన్యాదుల విక్రియ పన్ను
కూరగాయల పన్ను
బెల్లము పన్ను
పంచదార పన్ను
బాలికా వివాహము పన్ను
పెండ్లిపెద్దల పన్ను
పునర్వివాహముల పన్ను
ఫలవృక్షముల పన్ను
తపాలా పన్ను

ఇట్లు కృషీవలుని ఆదాయములో నూటికి 60 వంతులకు పైగా పన్నులక్రిందనే చెల్లిపోవును.

### ఇక, నగరవాసులు చెల్లింపవలసిన పన్నులివి:

నగరములోనికి దిగుమతియైన వస్తువు లన్నిటిపైనను సుంకము
ఇంటిపన్ను
బండిపన్ను
యుద్ధఋణపు పన్ను
పశుగ్రాసపు పన్ను
నేతి యుత్పత్తి పన్ను
నేతి దిగుమతిపన్ను

### వ్యవసాయదారులు కాని గ్రామస్థులు చెల్లింపవలసినవి:

| | తలకు | రు. |
|---|---|---|
| వడ్డీవ్యాపారి, చిల్లరదుకాణదారుడు వగైరా | ... | 4-0-0 |
| వడ్రంగి, దర్జీ వగైరా | ... | 3-8-0 |
| కమ్మరి | ... | 3-0-0 |
| ఊడ్పుకూలీలు, కోతకూలీలు వగైరా | ... | 3-0-0 |
| దూదేకువాడు, సాలీ వగైరా | ... | 3-0-0 |
| పై వృత్తులకు చెందని తదితరులు | ... | 2-0-0 |
| గొల్లలు వగైరా | ... | 1-0-0 |
| బిచ్చగాండ్రు (బ్రాహ్మణులు, ఫకీరులు, సాధువులు.) | ... | 1-0-0 |

### ఇవి కాక:

నేతి పన్ను
పశుగ్రాసము పన్ను
ప్రత్తి పన్ను
ఉప్పు పన్ను
కరవు పన్ను

ఈ పన్ను లన్నియు ఇట్లుండ నవానగరు సంస్థానములో ఒక విచిత్రమైన పద్ధతి యున్నది. బ్రిటిష్ ఇండియాలో కల్లు, సారాయి, గంజాయి, నల్లమందు మున్నగు మత్తుపదార్థములలో స్వేచ్ఛగ వ్యాపారము నల్పుటకు వీలులేదు. దొరతనమువారు పెట్టిన పాటలో హెచ్చుగ పాడినవానికే వానిని అమ్ముకొను అధికార మిత్తురు. ఇట్లే నవానగరు సంస్థానమునందు పొగాను, కిరసనాయిలు, పెట్రోలు, అగ్గిపెట్టెలు వగైరాలను ఇజారా పాడినవారే అమ్ముకొనవలెను!!

పైన పేర్కొనిన వస్తువులకు ఒక్కొక్క దానికిని రు 75,000 లు మొదలు రు 1,50,000 వఱకు యిజారా మొత్తము క్రిందగ కొనుచున్నారు. దైనందిన జీవితావశ్యముల వ్యాపారము నిట్లు నిరోధించు ఘోరము, సభ్య ప్రపంచములో మరెచ్చటను కానరాదు.

సంస్థానము అవలంబించు ఈ విపరీత విధానమువలన ప్రజలకు కలుగు నష్టములకును, వారు పడవలసిన బాధలకును, అంతులేదు. ఇందుకు నిదర్శనముగా "యార్క్ ఇన్సైడ్ వ్యూ ఆఫ్ నవానగర్" అను కరపత్రమునుండి పుగాకు ఇజారాకు సంబంధించిన భాగములను క్రింద పేర్కొనుచున్నాను:

"పుగాకు ఇజారాను అమలు జరుపుట కష్టమైన పని. కాని, దానిని అమలుజరపి తీరవలెను. అందుచేత ఆపనికొరకు సంస్థానము 179 విభిన్నమైనట్టి సర్క్యులర్సును జారీ చేసినది.

"అందరు సంస్థానోద్యోగులును— న్యాయశాఖ, పోలీసుశాఖ, రివిన్యూశాఖ : ఇట్లు అన్ని శాఖల వారును— ఇజారాదారునకు అతని వ్యాపారనిర్వహణములో తోడ్పడవలెనని చాల సర్క్యులర్సు వెళ్ళినవి.

" 1933 మే 1వ—తేదీనాటి స్టేట్ గెజెట్‌లో 300 పేజీలో క్రింది సర్క్యులర్‌ను అచ్చు వేసిరి :

" పుగాకును వాడువారు తాము ఇజారాదారు దగ్గర ఖరీదు చేసిన పుగాకును మాత్రమే వాడుచున్నట్లు ఇజారాదారునకు సంతృప్తికరముగా ఋజువు పరచవలెను. ఇట్లు చేయనిచో వారు బయటనుండి వచ్చిన పుగాకును వాడుచున్నట్లుగా ఎంచి, 1921 జులై 30 వ-తేదీనాటి 8వ- సర్క్యులర్ 60వ- రూల్ ప్రకారము వారికి శిక్ష విధింపవలసి వచ్చును. పుగాకు వాడువారు తాము సంస్థానము పుగాకును మాత్రమే వాడుచున్నట్లును, బయటి పుగాకును వాడుట లేదనియు నిరూపించుకొనవలెను. ఇట్లు చేయనివారికి శిక్షపడును.

20 ఏప్రిల్, 1923.
(సం.) జి. బి. దేశాయి.
రివిన్యూ సెక్రెటరీ.'

" 'జాంసాహెబ్ పాదపద్మసన్నిధిని' అను గ్రంథమునుండి క్రింది విషయమును ఉదహరించుచున్నాము :

"పదధారి మామ్లత్ దార్ ఇజారాదారు సంబంధితు నొకనిని వెంటబెట్టుకొని విశామన్ అను గ్రామమునకు వెళ్ళెను. వారిద్దరు గ్రామస్థుల నందరిని ఒక చోటికి చేర్చి, పుగాకును తక్కువగా వాడుచున్నందులకు వారిని మందలించిరి. చాటుమాటుగా సంస్థానము వెలుపలినుండి పుగాకును తెచ్చుచుండుట చేతనే ఆ గ్రామములో దాని ఖర్చు తగ్గియుండునని మామ్లత్ దార్ నిర్ణయించి, గ్రామస్థు లందరికిని జరిమానా వేసెను. తర్వాత అతడు ప్రతిగ్రామస్థుడను కనీసము అరవీసె పుగాకును కొనవలెననియు, పుగాకుతో పనిలేకపోయినచో, దాని ఖరీదునైనను చెల్లించుకొనవలెననియు హుకుం జారీ చేసెను. ఇందుకు అంగీకరించని గ్రామస్థుల దగ్గరినుండి అతడు తన ఆజ్ఞాపాలనమునకు అవసరమగు దస్తావేజులను వ్రాయించి పుచ్చుకొనెను.'

"బయటినుండి వచ్చువారు పుగాకును గాని, చుట్టలు మొదలైన వానినిగాని సంస్థానములోనికి తెచ్చెదరేమో నను అనుమానముతో సంస్థానము సరిహద్దులదగ్గర అందరిని సోదా చూచుచుందురు. ఈ సోదాలో ఎవరిదగ్గరనైనను 25 సిగరెట్లకంటె ఎక్కువ కనబడినట్లయిన అతనికి వాటిపై చెల్లించవలసిన సుంకమునకు పదిరెట్లు జరిమానాను వేయుదురు.

"ఇంతేగాక ఇజారాదారుకు తనబాకీలను రివిన్యూబాకీల పద్ధతిని వసూలుచేసుకొనుటకు అధికారమిచ్చిరి. లోకు లివ్వవలసిన బాకీలవసూలువిషయములో అతడుకోర్టుకు వెళ్ళవలసినపని లేదు.

"ఈ రీతిగా నవానగరు సంస్థానములో పొగ త్రాగవలసి నదిగా ప్రజలమీద కొంతవరకు నిర్బంధములను పెట్టు చున్నారు !"

పుగాకు వ్యాపారమువలె ప్రత్తిమరలు కూడ ఈ సంస్థానమున ఇజారాలో నున్నవి. దీనిని గురించి పైన పేర్కొనిన కరపత్రములో ఇట్లున్నది :

"ప్రత్తిమరలమీద ఇజారా హక్కు 1925 జులై 26 వ తేదీ నాటి హుజూర్ ఆర్డర్ ప్రకారము 15 సంవత్సరముల గడువు మీద సేఠ్ లాల్జికి సంక్రమించినది. ఆ ఆర్డర్లోని ఒక భాగ మిది :

'సంస్థానములో పండు ప్రత్తిని ఇక్కడని మరలలోనే పట్టించు కొనవలెను గాని, సరిహద్దు వెలుపలికి తీసుకొని పోరాదు... ఇక్కడి మరలలో పట్టించక ఎవరైనను ప్రత్తిని బయటికి ఎగుమతి చేసినచో, వారికి మణుగు ఒకటికి అయిదురూపాయల చొప్పున జరిమానా విధింతుము.'

ఈ నిబంధనలవలన క్రింది విపరీతము జరుగుచున్నది :

"సంస్థానములో ఆటకోట, భద్లా అను రెండు జిల్లాలలోను ప్రత్తి పండుచున్నది. ఈ జిల్లాలకును, రాజకోట పట్టణము నకును 16 మైళ్ళ దూరమే. ఇక సంస్థానమువారి ప్రత్తిమర యున్న నవానగర్ పట్టణము వీనికి 66 మైళ్ళ దూరములో

నున్నది. రాజకోటలో ఒక బేలు ప్రత్తిని పట్టుటకు 4½ రూపాయలు మొదలు 5½ రూపాయల వరకు చార్జి చేయుదురు. ఇక నవానగర్‌లో బేలుకు 7 రూపాయల చొప్పున చార్జి పుచ్చుకొందురు.

"ఇందువల్ల ఇప్పుడు జరుగుచున్న దేమన,— ఈ రెండు జిల్లాల వారు 50 మైళ్ళ దూరము అదనముగా తమ ప్రత్తిని తీసుకు వెళ్ళి, దానిని పట్టించుకొనుటకు బేలు ఒకటికి రెండు రూపాయలు అదనముగా చార్జిని చెల్లించుకొనవలసి వచ్చుచున్నది!" ఇక్కడికి ఈ ఘోరము లన్నియు చాలునట్లు నవానగరు సంస్థానము స్వయముగా ఉప్పు వ్యాపారమును సాగించి ప్రజల రక్తమాంసములను పిండుచున్నది ఈ వ్యాపార సందర్భములో సంస్థానము చేసిన ఈ ఉత్తరువు ఎంతటి కఠోరముగ నున్నదో చూడుడు :

"సంస్థాన ప్రజలు తమ సంఖ్యాబలమునకు తగినట్లుగా ఉప్పును వాడకము చేయుటలేదు అందువలన క్రింది ఏర్పాటులను చేయుచున్నాము :

"ప్రతి గ్రామమును, పట్టణమును తప్పనిసరిగ వాడవలసిన ఉప్పును గురించి నిర్ణయము చేయుచు సుంకములశాఖవారు పట్టికలను తయారు చేయుదురు. ఈ పట్టికలను మామ్లత్‌దారులద్వారా రివెన్యూ గుమాస్తాలకు పంపుదురు. పట్టికలలో

నిర్ణయింపబడినరీతిని ప్రతికుటుంబమును ఉప్పును కొనవలసి యుండును.

"రివిన్యూ గుమాస్తాలు తమ సర్కిలులోని గ్రామములలో పర్యటనము చేయునప్పుడు ప్రతి గృహస్థు పట్టికలలో నిర్ణయించినరీతిని ఉప్పును వాడుచున్నారో, లేదో, ప్రత్యేక శ్రద్ధ వహించి కనుగొనవలెను. ఎక్కడెక్కడ లేదో, అక్కడ సరియైన వాడకము జరుగునట్లు వారు ఏర్పాటు చేయవలెను... ఈ పని నిమిత్తము అవసరమైనచో వారు పోలీసు సహాయమునకు వ్రాసుకొన వచ్చును.

"గ్రామములో మకాం చేసినప్పుడు తాలూకా మామ్లత్ దార్లును, పోలీసు ఇనస్పెక్టర్లును, పోలీసు సబ్ ఇనస్పెక్టర్లును కూడ ఈవిషయములను గురించి జాగ్రత్త పుచ్చుకొనవలెను.

5-1-1924 (సం.) మహేర్వాన్జీ పెస్టన్జీ,
నవానగర్ సంస్థానపు దివాను."

పై ఉత్తరువు పేర్కొనుచున్న పట్టికలలోని ఏర్పాటు ఏమనిన, సాలుకు తలకొకటికి అరమణుగు చొప్పున సంస్థాన ప్రజలందరును తప్పనిసరిగ ఉప్పును వాడి తీరవలెను. తలకొకటికి అరమణుగు ఉప్పుతో పని యున్నను, లేకపోయినను తాలూకా ఆఫీసునకు వెళ్ళి, దాని ఖరీదును ముదుపుగా చెల్లించుకొని తీరవలసినదే! ఇందులో ఇంకొక విపరీత మేమనగా, సుంకముల శాఖవారు తయారుచేయు పట్టికలలో అప్పుడప్పుడు ఏ

నాడో చనిపోయిన వారి పేర్లుండుటకూడ కద్దు. అట్టి సందర్భములలో వారి కుటుంబములవారు ఆ చనిపోయిన వారికిందకూడ తలకు అర్థమణుగు చొప్పున ఉప్పును కొనవలెను. లేదా, దాని ఖరీదును చెల్లించవలెను!! దీనిని మించిన ఘోరమును ఊహించ శక్యమా?

సభ్యతా ప్రపంచములో కనివిని యెరుగని రీతిగా "ఇజారా" ను అమలు పరచుటలో నవానగరు సంస్థానమును కూడ మించినది, గోండల్! ఈ సంస్థానము అమలు జరుపుచున్న "ఇజారాలు" ఇవి: పంచదార, బెల్లము, కలప, మంచుగడ్డ కిరసనాయిల్, పెట్రోల్, సబ్బు, రాయి, సున్నము, తోళ్ళు, నూనె గానుగలు, ఎరువు, కూరగాయ దుకాణములు, బండ్లు, గడ్డిమోపులు, కట్టెమోపులు, మోటార్ లారీ సర్వీస్, సినిమాలు, పిచ్చిక బయళ్ళు, కల్లు—సారాయములు, నల్లమందు, భంగ్ — గంజాయిలు.

పీలు పడదుగాని, లేకపోయిన గాలినికూడ ఇజారా పాడేవాడు, ఈ సంస్థానాధిపతి!

ఇక ఆళ్వారుసంగతి. ఆ సంస్థానపు జనసంఖ్య కింది విధముగ తగ్గుచు వచ్చినది:

| | |
|---|---|
| 1901 | 8,28,489 |
| 1911 | 7,31,668 |
| 1921 | 7,01,154 |

భారతదేశమొత్తమున 1901—1921 సంవత్సరములమధ్యజనాభా హెచ్చినదిగాని, తగ్గలేదు ఇట్టియెడ అళ్వారు సంస్థానములో ప్రత్యేకముగ జనసంఖ్య తగ్గుటకుగల కారణమేమి? క్షామమో, వ్యాధుల ప్రబలతయో, వలసయో దీనికి కారణమై యుండవలెనుగదా! కారణ మేమియైనను అళ్వారు సుభిక్షముగ లేదనుట సువిదితమే! ఐనను సంస్థానాదాయము క్రిందివిధముగ వృద్ధినందెను:

| | పౌండ్లు. |
|---|---|
| 1911 | 2,00,000 |
| 1921 | 3,50,000 |
| 1927 | 4,00,000 |

కేవలము 16 సంవత్సరములలో — అందును జనసంఖ్య యావద్భారతస్థితికి విరుద్ధముగ లక్షకు పైగా తగ్గినపుడు—సంస్థానాదాయము రెట్టింపయ్యెను. అక్రమముగా శిస్తులు అధికముగ విధింపబడుచున్నవనుట కింతకన్న వేఱేమి కావలెను?

ఇంతకును నవాబుగరులో విధింపబడుచున్నవని పూర్వము ఉదాహరణముగ పేర్కొనిన వన్నియు సాధారణమైన పన్నులే. ఇవిగాక అసాధారణమైనవి మఱికొన్ని యున్నవి. గవర్నర్లుగాని, వైస్రాయిగాని, తదితర ప్రభుత్వోన్నతోద్యోగులు గాని సంస్థానమును సందర్శింపవచ్చినప్పుడు వారి విందులకు, వినోదములకు, ఆటలకు, పాటలకు చెల్లిపోవు లక్షలాది ధనమును

సామాన్యముగ ప్రజలే భరింపవలెను. సంస్థానాధీశుని వివాహ వ్యయమును కూడ వారే కొంతవఱకు పెట్టుకొనవలెను. ఒక్క సంస్థానాధిపతి వివాహ సందర్భముననే కాదు,— అతని కుటుంబములో ఎవరి పెండ్లియైనను ప్రజలు ముడుపును చెల్లించు కొన వలసినదే! ఇట్లే మఱి యెన్నో పన్ను లున్నవి, కుప్ప తెప్పలుగ!!

నైజాములో పన్నులమూలముగా ప్రజలు పడుచున్న బాధలను "నవశక్తి" (బెజవాడ) ప్రకటించిన క్రింది వార్తవలన తెలియగలదు:

"నైజాంలో శాయిరీ వసూళ్ళు మిక్కిలి ఘోరంగా ఉన్నాయి. ఏదైనా బస్తీలో సరుకులు కొన్న గ్రామస్థుడు ఆ దుకాణదారు వద్ద సరుకుల పట్టీ తీసుకొని కరణం వద్దకు పోవాలి. అక్కడ మామూలు 0-4-0 ముడుపు చెల్లిస్తే కరణం పట్టీపై సంతకము పెట్టి, శాయిరీ ఆఫీసుకు పంపుతాడు. అక్కడకు పోయి మళ్ళీ అక్కడ ముడుపు చెల్లించుకొని ప్యాసు తీసుకొని నాకాకు వెళ్ళాలి. 415 గ్రామాలకు కలిపి ఈ నాకా వుంటుంది. ఆ గ్రామస్థుడు తన గ్రామాని కెంతదూరంలోవున్నా ఆ నాకాకు వెళ్ళి ప్యాసుచూపించి, మళ్ళీ ముడుపు చెల్లించుకొని, అప్పుడు స్వంత గ్రామం తీసుకొనిపోవాలి. ఈ బాధలేక సాధారణంగా శాయిరీ ఉద్యోగస్థులకు లంచాలిచ్చి సరాసరి తమ గ్రామాలకే పోతూవుంటారు ప్రజలు.

నైజాంలో, ఎక్కువ చలామణీ అయ్యేది బండీరూపాయలు. హాలీ రూపాయల చలామణీ చాలా గ్రామాలలో తక్కువ. కాబట్టి ప్రభుత్వానికి శిస్తులు చెల్లించవలసి వచ్చినా, బస్తీలలో సరుకులు కొనుక్కోన వలసినా బండీలను హాలీలలోకి మార్చు కొనునపుడు మారకం రూపాయికి 0 0-3, 0-0-6 చొప్పున యివ్వవలసి వస్తున్నది. ఈ విధంగా కొన్ని సార్లు మారకం జరిగేటప్పటికి రూపాయి మాయమైపోతుంది దీనివల్ల షరా బులు దోచుకుంటున్నారు; రైతులు మిక్కిలి నష్టపడు తున్నారు."

పన్నులవలన వచ్చు ఆదాయములో అధికభాగము భూమిశిస్తు నుండియే వచ్చును. ఈ భూమి శిస్తును కొన్ని సంద ర్భములలో ధనరూపమునను, మఱికొన్నిటియందు ధాన్య రూపమునను పరిగ్రహింతురు. శిస్తును ధాన్య రూపముగ వసూలు చేయుటవలన చాల యిబ్బందు లున్నవి. ముందుగ భూమి మంచిదో, కాదో నిర్ణయింపవలెను. పిదప మెట్టపైరో, వల్లపుపైరో తేల్చవలెను. పండిన పంటలో ఎంతభాగము సంస్థానమునకు పోవలెనో నిర్ణయించిన వెనుకకూడ, సంస్థానో ద్యోగులు వచ్చి తమ వంతును కొలుచుకొని పోవువఱకు రాశిని కళ్ళములో నుంచవలెను. ఈ లోపుగ వర్షము పడిన ఏటి కేడాది పొదుగున పడిన కష్టమంతయు గంగ గలిసిపోవును!

కొన్ని సంస్థానములలో పన్నుల నెట్లు హెచ్చింతురో 'ప్రిన్సీస్ ఇండియా' పత్రికలో (26—7—1926) ప్రకటితమైన క్రింది వాక్యములవలన విశదము కాగలదు :

"ఆదాయము చకచక పెఱిగిపోవుచుండును. 1921—22 సంవత్సరమునాటి భూమిశిస్తు నివేదికలో క్రింది విధముగనున్నది: 'సంస్థానమున గల పది తాలూకాలలో, నాల్గింటియందు రీసెటిల్ మెంటు జరిగినది. ఇందువలన పూర్వపుశిస్తు రు 3,32,476లు హెచ్చి, మొత్తము 25,86,352 రూపాయ లయ్యెను.' కాని, రీసెటిల్ మెంటువలన వచ్చిన అధికాదాయము కూడ సంస్థాన వ్యయమునకు సరిపోలేదు. అందుచేత బీదజనులపై మఱింత పన్నులభారము వేయుటయే మార్గమయ్యెను. ప్రత్యేకమైన కొన్ని రోడ్లను ఉపయోగించు బండ్లవారి మీదను, పాదచారులపైనను వేసిన పన్నును హెచ్చించుటకు వీలుకాన్పించెను. 1922 నవంబరు నెలలో ప్రకటితమైన 'ఎక్స్ట్రా ఆర్డినరీ గెజెట్' లో ఇట్లుండెను: 'కేవలము వేటకొఱకై వేయబడిన రోడ్లపై ట్రాఫిక్ తగ్గించుటకే ఫలానా టోల్ గేటు రేట్లు సదా ఉద్దేశింపబడినవి గాన...' 'మహారాజుగారు రేట్లను మార్చిరి. ప్రజలు వర్తకవ్యాపారములకై తగని రీతిని రోడ్లను ఉపయోగించుచుండ మహారాజుగారు మొదట దానిని నిర్మించిన ఉద్దేశమును విస్మరింపలేరు.' తదుపరి క్రొత్తరేట్లను పేర్కొనిరి. ఎడ్ల బండ్లపైనను, ఒంటెలపైనను 5 నుండి 10 రూపాయలకు

పన్నును హెచ్చించిరి. గుఱ్ఱముల పైనను, కంచరగాడిదలపై నను 1 నుండి 5 రూప్యములవఱకు హెచ్చుచేసిరి. పాద చారులపై 1 నుండి 2 రూప్యముల దనుక వృద్ధిచేసిరి. ఇట్లే తదితరములు. మొత్తముమీాద పన్ను 2 రెట్లు మొదలు 5 రెట్లవరకు హెచ్చింపబడెను."

ఈ పన్నులను చెల్లింపలేక ప్రజాసామాన్యము పడు పాట్లు, కడగండ్లు...

జాబ్వా సంస్థానములో ప్రజలు పడుచున్న యిక్కట్లులను గమనింపుడు: 1933, జులై 16 వ తెదీనాటికి 'ప్రిన్సిస్ ఇండియా' పత్రికలో ఇట్లున్నది: "జాబ్వా సంస్థానమునందుగల రైతులలో హెచ్చుమంది భిల్లులు; పంటలు పండకపోవుటచే గత వత్సరమును, ఈయేడును వారు శిస్తును చెల్లింపనేరరైరి. కాని, నిర్దయుడగు ప్రభువు బాధ పెట్టుటచే వారు బకాయిని చెల్లించుటకు తమబిడ్డలను అమ్ముకొనిరి మూాలుగుచున్న నక్కపై తాటి పండు పడినట్లు వారిచే కూలి నాలి లేని వెట్టిచాకిరి చేయుంచిరి. దీనితో పరిపూర్ణ నిస్సహాయస్థితికి దిగనారి, రైతులు ఇండ్లను వాకిళ్ళను వదలిపెట్టి పోవలసి వచ్చెను. * * * పొట్టపోసి కొనుటకై దోహద్ వెళ్ళిన భిల్లు డొకడు కన్నబిడ్డలతోనయి తము నూతిలోబడి ఆత్మహత్య గావించుకొనవలసి వచ్చినట్లు యిటీవలనే తెలియవచ్చినది." ఇట్టి ఆత్మహత్యలను గూర్చి

మరికొన్ని హృదయనిర్భేదక వివరములు గలవు, పై పత్రిక లోనే!!

కరాచీనగరములో 1936 జూలైలో జరిగిన అయిదవ అఖిల భారతసంస్థాన ప్రజాసంఘసమావేశములో అధ్యక్షులు డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్యపంతులుగారు భూమి శిస్తు వసూలు సందర్భములో కొందరు సంస్థానపతులు చేయు ఘోర దురంతములను క్రిందివిధముగా వర్ణించిరి:

"లోహార్, పంజాబ్‌లోని ఒక చిన్న సంస్థానము. దానికి ఉత్తరదిశలో హిస్సార్‌జిల్లా యున్నది. తక్కిన మూడు దిక్కులలో జిండ్, జయపూరు, బికనీరు సంస్థానము లున్నవి. దాని విస్తీర్ణము 222 చదరపుమైళ్ళు, జనసంఖ్య 23,338 జనాభాలో 6/7 వంతులమంది హిందువులు (వారిలో సగము మంది జాట్ జాతివారు); పోగా మిగిలిన 1/7 వంతుమంది మహామ్మదీయులు. సంస్థానములో 70 గ్రామములును, ఒకే ఒక పట్టణములోనైనను జనాభా మూడువేలకు మించదు. సంస్థానప్రజలు మాయమర్మముల నెరుగనివారు; ధైర్యసాహసములు గలవారు; కష్టించి పని చేయువారు.

"సంస్థానమునకు భూమి శిస్తువలన 1908 వరకు 48,000 రూపాయల ఆదాయము వచ్చెడిది. 1909 నాటి సెటిల్‌మెంటులో దీనిని 73,000 రూపాయలకు హెచ్చించిరి. ఇంత—25,000 రూపాయల— హెచ్చుదలచేయుటకు కారణము—

నవాబ్ గారి ఋణగ్రస్తత. 24 సంవత్సరములకుగాను ఏర్పాటైనది ఈ సెటిల్మెంట్.

ఇది నిర్ణయించిన భూమిశిస్తు ఇరుగుపొరుగు సంస్థానములలోని శిస్తుకు దాదాపు మూడురెట్లు. ఇంత హెచ్చుగానున్న ఈ శిస్తులో లేశమైనను ప్రజలకు ఏదైన ఒక సౌకర్యరూపములో తిరిగి చెందదని వేరుగ జెప్పవలసిన పనిలేదు. ఏలనన, సంస్థానములో రైలు అసలులేదు; పోస్టాఫీసు ఒక్కటిమాత్రమే ఉన్నది; లోహారు పట్టణములోని ఒక్క చిన్నపాఠశాలను, వైద్యశాలను మినహాయించిన, సంస్థానగ్రామములలో మచ్చుకైన ఇట్టి ప్రజాహిత సంస్థలు లేవు. తమకు విద్య, వైద్య సహాయము మొదలగు సౌకర్యములు కావలయునని ప్రజలు ఆందోళన చేసినచో, సంస్థానము వారికి కలుగు ఆగ్రహము ఇంతంత కాదని కూడ చెప్పుదురు.

"ఇవి ఘోరమైన విషయములే! కాని, వీనిని మించినది మరొకటికూడ గలదు. 1909 నాటి సెటిల్ మెంట్‌కు పూర్వము రైతులకు పట్టాలను ఇచ్చియుండలేదు. కాని, ఆ సంవత్సరములో జరిగిన సెటిల్ మెంట్ సందర్భములో శాశ్వతమైన పట్టాలను జారీ చేసిరి. తర్వాత 1923 లో ఇంకొక సెటిల్ మెంట్‌ను చేసి, భూమి శిస్తును 94,000 రూప్యములకు పెంచుచు, పూర్వము జారీ చేసిన పట్టాలలో నవాబు మార్పులు చేయించెను. ఇంతే కాదు. అతడు వారసత్వపు

హక్కుల విషయములో జోక్యము కలిగించుకొనెను. 1857 కు పూర్వము విరివిగా అమలులోనున్న జప్తు అధికారాన్ని విని యోగించి, వారసులు లేకుండ చనిపోయినవారి భూములనే గాక, తాత్కాలికముగా సేద్యమును మానివేసిన వారి భూము లనుకూడ స్వాధీనపరుచుకొనెను. ఇంతటితోనైనను సరిపుచ్చక అతడు క్రొత్తక్రొత్త పన్నులను కనిపెట్టెను. ఈ పన్నులకు ఉదాహరణ లివి: సంస్థానము వెలుపల అమ్మకము చేయు ఎద్దులపై పన్ను; మేకలపైన, గొర్రెలపైన పన్ను; సంస్థా నము నష్టయిచేయుట ఆపివేసినను తూకపురాళ్ళపై పన్ను. ఈ క్రొత్తపన్నులకు తోడు అంతకుపూర్వము అప్పుడప్పుడు చెల్లించవలసిన సిపాయిపన్నును వార్షికముగా చెల్లించవలసి యుండునని అతడు ఉత్తరువు చేసెను. నవాబ్‌సాహెబ్ పెండ్లి ఖర్చులకుగాను 1931 నుండి 1933 వరకు మూడు సంవత్సర ములపాటు ప్రజలు విడిగా మరొక పన్నును చెల్లించవలసి వచ్చెను. పైన చెప్పిన పన్ను లన్నియు గాక వితంతు వివా హమువన్ను మొదలైనవి ఎన్నో విపరీతములైన పన్నులు కూడా నున్నవట. ఈ పన్నుల బాధను పడలేక ప్రజలు నవా బుకును, అతనిపై అధికారులకును విజ్ఞప్తులను పంపుకొనిరి. కొన్ని సంవత్సరములలో యీ విజ్ఞప్తులవలన కొంత లాభము చేకూరెనుకూడ. కాని, ఇంతలో 1935 ఆగస్టు 6-8 తేదీలనాటి దుర్ఘటనలు వచ్చిపడినవి. వానిని గురించి లోహారు ప్రజలు చెప్పిన వృత్తాంతమును క్రింద పేర్కొనుచున్నాను :

"1935 జులై 15 వ తేదినాడు గవర్నర్ జనరల్ ఏజెంట్ (ఇతనిని ఎ. జి. జి. అని అందురు) లోహారు సంస్థానమునకు వచ్చెను. ఆయన రాకకు నవాబు ఆహ్వానమే కారణమై యుండ వచ్చును. ఎ. జి. జి., నవాబు— వారుభయులును సంస్థాన ములోని ప్రముఖులను పిలిపించి, వారితో మాటాడిరి. 1923 నాటి సెటిల్‌మెంటుకు అంగీకరించినచో, ఒంటెల పన్ను వినా తక్కిన పన్నులన్నిటిని తగ్గించెదనని ఆనాటి మాటల సందర్భ ములో నవాబు వాగ్దానము చేసెను. పరిస్థితులేమియు బాగుండ నందున 1909 నాటి సెటిల్‌మెంటును అమలు జరుపవలసి నదిగా ప్రజాప్రముఖులు నవాబుతో మొరపెట్టుకొనిరి.

"పదునైదు రోజుల తర్వాత— అనగా జులై 30 వ తేదీ నాడు— ఒంటెల పన్నును వసూలుచేసుకొని రావలసినదిగా నవాబు కొంతమంది తాబేదారులను చెహార్‌కాలన్ అను గ్రామమునకు పంపించెను. ఆగ్రామప్రజలు పన్నును చెల్లింప నిరాకరించిరని చెప్పుచు తాబేదారులు తిరిగివచ్చిరి. ఈవార్తను విని సైనిక సహాయమును పంపవలసినదిగా నవాబు బ్రిటిష్ ప్రభుత్వమువారిని కోరెను.

"అతని ఉద్దేశమేమో ఎవ్వరికిని తెలియదుగాని, 1935 ఆగస్టు 6 వ తేదినాడు ఎ. జి. జి. తిరిగి సంస్థానమునకు వచ్చు ననియు, ప్రజలు తమ సాధకబాధకములను ఆ ఉద్యోగికి తెలుపుకొనవచ్చుననియు నవాబు ఒక వదంతి పుట్టించెను.

ఆగష్టు 5 వ తేదీ సాయంకాలమునాడు చెహార్ కాలక్ గ్రామములో సంస్థానోద్యోగులు కొన్ని గుడారములను కూడ వేయుటను చూచి, ప్రజలు ఈ వదంతి నిజమే అని నమ్మిరి. ఇక్కడనే సంస్థానమువారి కథనమును, ప్రజల కథనమును భేదించుచున్నవి. తిరుగుబాటు చేయు తలంపుతో ప్రజలు గుమి గూడిరని నవాబు చెప్పుచున్నాడు; ఇట్లు కల్పించి చెప్పవచ్చును గదా అని దురాలోచన చేసి, ఎ జి. జి. కి మహజరు పెట్టుకొనుడను మిషతో నవాబే తమను గుంపుగా చేర్పించెనని ప్రజ లనుచున్నారు ఆగష్టు 6 వ తేదీనాడు ఆగ్రామములోని ఇండ్లను సోదా చూడగా ఎన్నో లాఠీలు కనబడినవి గాన, తిరుగుబాటు ప్రయత్నమునకు ఇది నిదర్శనమని ఈ సందర్భములో సంస్థానమువారు వాదించుచున్నారు; ఇందుకు ప్రజలు చెప్పు సమాధాన మిది: 'మా ఇండ్లలోనున్నవి లాఠీలు కావు; ప్రతి రైతు నిత్యజీవనములో ఉపయోగించు చేతికర్రలు. ఎ. జి. జి. దొరవారి దర్శనమునకు వెళ్ళుచు, చేతికర్రలను పట్టుకొనిపోవుట మర్యాద కాదని వానిని ఇండ్లలోనే విడిచి పెట్టితిమి.'

"ఎ. జి. జి. రాకకై ప్రజలు రోడ్డు ఇరు ప్రక్కల వేచియుండగా, వారికి నవాబు మోటారుకారు కనిపించినది. ముందు నవాబుకారు వచ్చినది గనుక, దాని వెనుకనే ఇక ఎ. జి. జి. గారు కూడ తప్పక వత్తురనియు, తమకు ఆయన

దర్శన మిచ్చునవియు ప్రజ లాశపడిరి. కాని, ఎ. జి. జి. గారు వారిదగ్గర ఆగక సరాసరి అతివేగముగా వెళ్ళిపోయెను. అంతకు పూర్వము ప్రజ లందరును కూర్చుండియుండిరి. కాని, ఎ. జి. జి. గారు వచ్చినంతతే వారు లేచి నిలబడిరి. ఇట్లు చేయుట కేవలము ఎ. జి. జి. పట్ల తమకుగల గౌరవమును ప్రకటించుటకే! కాని, సంస్థానోద్యోగులు దీనిని చూపి, 'ఎంతటి పొగరుబోతులో గమనించితిరా?' అని అని రట!

"అటు తర్వాత జరిగిన సంఘటనలు అతి ఘోరమైనవి. గ్రామప్రముఖులలో కొందరిని పిలిపించి, ఖైదుచేసిరి. తర్వాత నవాబే స్వయముగా లాఠీచార్జి చేయుమని ఆజ్ఞాపించెను. దానికి తాళలేక అనేకమంది గ్రామస్థులు ప్రక్కనున్న అడవి లోనికి పారిపోయిరి. నవాబు తాబేదారులు సోదా అను మిషతో గ్రామముపై బడి దోపిడిని సాగించిరి. కేవలము దోపిడితోనే సంతృప్తిపడక ఎన్నో యిండ్లకు నిప్పుకూడ పెట్టిరి. ఇంతేకాదు, గ్రామాలయమును అపవిత్రము చేసిరి: భర్తలు భయ భ్రాంతులై పలాయనమైనందున యథేచ్ఛగా భార్యలను చెర బట్టి మానభంగము చేసిరి. ఇంతటి ఘనవిజయమును పొంది నందులకు ఆ రాత్రి ఆటలతోను, పాటలతోను వారు పెద్ద పండుగను చేసుకొనిరికూడ!

"ఆ మరునాడు—అనగా ఆగష్టు 7వ తేదీనాడు— నవాబు తాబేదారులు మన్‌డోలీ, కాస్లి, గోకుల్‌పూర్ గ్రామముల

పై దండెత్తి వెళ్ళిరి. ఇట్లే వారు తిరిగి 8వ తేదీనాడు సింఘానీ గ్రామముపై బడి, ఒంటె పన్నును తే తెమ్మనిరి. పన్నును చెల్లించుటకు గడువు దయచేయవలసినదిగా గ్రామస్థులు వేడుకొనిరి. గ్రామస్థులు గడువుకోరినమాట అబద్ధమనియు, వారు పన్నునివ్వ నిరాకరించి, దౌర్జన్యము చేయ సమకట్టిరనియు నవాబు అనుచున్నాడు. ఒకవేళ గ్రామస్థులు నిజముగా పన్నును చెల్లింప నిరాకరించినను, వారిపై తుపాకులను పేల్చవలసిన అవసరము లేదు. ఏలనన వారివద్ద నుండి పన్నును వసూలు చేయుటకు మరెన్నియో సాధనము లున్నవి. అయినను నవాబు ప్రజలపై తుపాకులను పేల్పించెను. ఆత్మరక్షణకొరకు తుపాకులను పేల్చుట అవసర మైనదని నవాబు పక్షమున ఇంకొక ఆర్గ్యుమెంటు కూడ చెప్పుచున్నారు. దీనిని నిజమని అంగీకరించినచో, వెంటనే ఇంకొక ప్రశ్నను అడుగవలసి వచ్చును. నవాబు పక్షమువారిలో ఎవరైనను గాయపడిరా? కాని, సత్య మేమనిన ఎవ్వరును గాయపడలేదు. ఇట్టిచో ఆత్మరక్షణ నిమిత్తము తుపాకులను కాల్చవలసి వచ్చెనను మాటను ఆమోదించు టెట్లు? పైగా, కేవలము ఆత్మరక్షణకే తుపాకులను కాల్చి స్త్రీలు, పురుషులు, పశుగణము అర్థములేకుండ చనిపోవుట ఎట్లు సంభవించును? 6 వ తేదీనాటి సంఘటనల తర్వాతకూడ ఈ గ్రామముపై విరుచుకు పడుచు నవాబు తాబేదారులు బ్రిటిష్ ఫౌజును వెంటనే పెట్టుకొనక పోవుటను బట్టియు, గ్రామస్థులపైన తుపాకులను

పేల్చిన పిదప చనిపోయినవారిని, గాయపడినవారిని వారిగతికి వారిని వదలిపెట్టి బందిపోటు దొంగలవలె పారిపోవుటను బట్టియు, తుపాకులను పేల్చుట నిజముగా అనవసరమనియు, క్రౌర్యకృత్యమనియు నిస్సంకోచముగ చెప్పవచ్చును. జన నష్టము విషయమై ముగ్గురు మాత్రమే మరణించిరనియు, 35 మంది గాయపడిరనియు నవాబు అనుచున్నాడు. కాని, పది శవములను ఒంటెపై కట్టి భవానీ ఆస్పత్రికి తెచ్చినట్లు అధికారరీత్యా ఋజువు పరచవచ్చును. భవానీ ఆస్పత్రికి చేరిన ఆ పది శవములు గాక, మరి ఎన్నియో సింఘానీ గ్రామమున మిగిలిపోయినవి.”

ఈ విధముగా లోహార్‌లో జరిగినవానికంటె ఎంతో ఘోరమైన కృత్యములు సికార్ సంస్థానములో జరిగినట్లు పట్టాభి సీతారామయ్య పంతులుగారే తమ అధ్యక్షోపన్యాసములో చెప్పిరి. అక్కడ దారిద్ర్య బాధవలన మహా దుస్థితిలో నున్న ప్రజలవద్దనుండి అంతుపంతు లేని భూమిశిస్తును వసూలుచేయు ప్రయత్నములో సంస్థానమువారు క్రింది రాక్షసకృత్యములను నెరపిరట :

1. హత్యలు

2. తుపాకి కాల్పులు

3. లాఠీచార్జీలు

4. పాఠశాలలను పడగొట్టుట, మూసివేయుట

5. ఇండ్లను పైబడి దోచుకొనుట; ఆస్తిని నష్టపరచుట

6. చెల్లించవలసిన దానికంటె అధికముగా శిస్తును, తీరువాలను రాబట్టుట

7. జరిమానాలు, సైనిక పు ఖర్చులు అను వంకతో డబ్బును వసూలుచేయుట

8. స్త్రీలను మానభంగ మొనర్చుట; వారి ఆభరణములను హరించుట

9. జాట్ జాతివారికి (సంస్థాన ప్రజలలో అధికసంఖ్యాకులు వారే. కష్టముచేయునది వారు; కష్టములకు లోను గావలసినది వారు) సహాయము చేసిన ప్రజలను సంస్థానమునుండి వెడల గొట్టుట

10. జాట్ జాతివారిని హింసపెట్టు రాజపుత్రులకు ప్రోత్సాహమిచ్చుట; జాట్ జాతివారు గుర్రమునుగాని, ఒంటెను గాని ఎక్కరాదనియు, వారు దేవదర్శనమునకు రాగూడదనియు అభ్యంతరములను పెట్టుట.

11. జాట్ జాతివారు పంపు అర్జీలను పుచ్చుకొనవలదని పోలీసు వారికిని, కోర్టువారికిని ఉత్తరువు చేయుట.

ఈ అత్యాచారములపై పట్టాభిసీతారామయ్య పంతులుగారి వ్యాఖ్యాన మిది: 'ఈ ఇరువదవ శతాబ్దపు నాగరక ప్రపంచములో ఇంతటి ఘోరములు మరెచ్చటను కానరావు'

ఈ "ఘోరముల" పట్టికకు మరికొన్నింటిని గూడ కలుపవచ్చును. రాజపుత్రస్థానంలోని ధరంగధర సంస్థానములో భూమిశిస్తు బకాయికి పెండ్లికాని ఆడపిల్లలను జప్తుచెయ్యవచ్చును! ఇక్కడనే మరికొన్ని సంస్థానములలో శిస్తు చెల్లించని వారిని (అనగా చెల్లించలేకపోయిన వారిని) దండించుటకు మేకులు తాపడంచేసిన చెప్పును ఉపయోగించుదురు.

ఇట్లు విపరీతముగ బాధపెట్టి పన్నులను వసూలు చేసినను, తుదకు ప్రజలకు చేయు సౌకర్యములు సున్నయే! కొన్ని రాజపుత్రస్థాన సంస్థానములలో కనీసము మంచినీటి సౌకర్యమైనను లేదట! అక్కడ మండు వేసవిలో స్త్రీలు నెత్తిపై బిందె పెట్టుకొని నాలుగైదు మైళ్ళు వెళ్ళవలసివచ్చునట! వసూలైన డబ్బు మహారాజుల స్వంతఖర్చులకు అసలు సరిపోయిన గదా, ప్రజాసౌకర్యముల మాట!

వచ్చిన ఆదాయ మంతయు ప్రజాసౌకర్యములకొఱకు గాక, సంస్థానాధీశుని విదేశసంచారమునకును, విలాసయుత జీవితమునకును వెచ్చింపబడుచున్న విషయము క్రింది పట్టికవలన విదితము కాగలదు.

| సంస్థానము. | సగటున తలకుపన్ను. | సంస్థానాధిపతిస్వంత ఖర్చునూటికి | విద్యా వ్యయము తలకు. | వైద్యసహాయమునకు వ్యయము తలకు. | [illegible] |
|---|---|---|---|---|---|
| కాశ్మీరు ... | 6-0-0 | 20 | 0-6-0 | 0-3-0 | 2 |
| బికనీరు ... | 16-8-0 | 20 | 0-5-0 | 0-4-0 | 3 |
| ఇందూరు ... | 13-8-0 | 17 | 0-7-0 | 0-2-0 | 3 |
| ఆళ్వారు ... | 11-4-0 | 50 | 0-3-0 | 0-1-0 | 2 |
| పాటియాలా. | 11-4-0 | 25 | 0-3-0 | 0-2-0 | 2 |
| నవానగరు... | 22-8-0 | 45 | 0-6-0 | 0-4-0 | 3 |
| కపుర్థల ... | 11-4-0 | 25 | 0-7-0 | 0-3-0 | 3 |
| కచ్చి ... | 22-8-0 | 25 | 0-2-0 | 0-1-0 | 1 |

చూడ్గర్ వాక్యములతో ఆరంభించిన ఈ ప్రకరణము ఇక గాబా పలుకులతో ముగింతును: "రెండు సిద్ధాంతముల ననుసరించి పన్నులను విధింతురు. సంస్థానాధీశుని కెంత కావలసియున్నది? ప్రజ లెంత చెల్లింపగలరు?—వీనిలో రెండవదానికి అంతగ ప్రాముఖ్యము లేదు. * * * కొన్ని పన్నులు ధనరూపమునను, మఱికొన్ని ధాన్యరూపమునను వసూలు చేయుదురు. ఆదాయములో అధికభాగము భూమిశిస్తువలన వచ్చును. భూమిశిస్తుగాక వృత్తిపన్ను, పశువులపన్ను, ఎగుమతి – దిగుమతులపన్ను, మున్నగునవి మఱి కొన్ని కలవు. కొన్ని సంస్థానములలో జననమరణములు కూడ ఆదాయ సంధాయకములే. ఈ సంస్థానాధీశ్వరులు వివాహానందమును ప్రజలకు పంచిపెట్టు

దురు. మహారాజుగారి కుటుంబమున పరిణయమహోత్సవము జరిగినప్పుడెల్ల బొక్కసము పండవలసినదే! రైతుల ఆదాయములో సగమునకు తక్కువగా సంస్థానము పుచ్చుకొనదు. మిగిలిన సగములోనే ముందు పైరునకు, విత్తనములు, కూడు గుడ్డలు, శుభాశుభములు తాణాదారు లంచములు మున్నగువాని నెల్ల పరిపుచ్చుకొనవలెను. ఖజానాకుపోవు సగమును చెల్లిపోవును: ఢిల్లీనరేంద్రమండలికి, నీస్‌నందలి నుత్సవార్త్యమునకు, ఫ్రెంచి విలాసవస్తుతతికి, పొలిటికల్ ఏజెంటు మృగయా వినోదమునకు, ఇటలీ పర్యటనమునకు, లండను విందులకు, స్పెయిను భోగకన్యలకు!"

# బేగారి

"కొన్ని సంస్థానములలో 'బేగారి' పద్ధతి యొకటి కలదు. ఇది యించుమించుగా బానిసతనమును బోలియుండును ప్రాచీన కాలమునుండియు ముఖ్యముగా నిమ్నజాతులవారి కిది తప్పని విధిగా వచ్చుచున్నది. అంతే కాదు. జనాభాలో నూటికి 80 లేక 90 పాళ్ళుండు వ్యవసాయకు లెల్లరు దీనికి లోనుకావలసి వచ్చుచున్నది. పోనీ, వారు చేసిన కష్టమునకు తగిన ప్రతిఫలము ముట్టునా ? లేదు. ఏదో పేరునకు ఉన్న కూలియే అసలు తక్కువ. దానినైనను సాధారణముగ చెల్లింపరు. పాటియాలా సంస్థానములో మహారాజుగారు షికారీ పార్టీలకు వెళ్ళుచు, జనముచే ఇట్లు నిర్బంధముగా కూలి చేయింతురు. కాలువలను బాగుచేయుట, సంస్థానమువారి తోటలను పెంచుట మున్నగు పనులనుకూడ ఇట్లే చేయింతురు. సంస్థానమువారి ఉపయోగము నకై ప్రజల యొంటెలను ఉచితముగా దీసికొందురు. వారి ఎడ్లను, బండ్లను తోలుకొని పోవుచుందురు. ప్రజలు ఊరక పాలు, పెరుగు, నేయి తెచ్చి యీయవలసియుండును. సంస్థానాధిపతిగాని, సంస్థానోద్యోగిగాని, సంస్థానసైనికదళముగాని

పర్యటనము గావించుచున్నప్పు డిట్టి సంభవములు నిత్యములు. నిర్బంధపు కూలి పాటును నిర్మూలించుటకై ప్రయత్నించుచున్న నానాజాతిసమితి సమావేశములకు మహారాజులు ప్రతినిధులుగా వెళ్ళుదురు. కాని, ఆ ప్రతినిధులే తమ సంస్థానములందు నిర్బంధపు కూలిని చేయించుచున్నారు.”

ఈ పలుకులు బాధ్యత లేని అనామకవ్యక్తివి కావు: థక్కర్ గారివి.

చాకలి, మంగలి, కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, దర్జీ — వీరు వారననేల ?— సమస్తజనులును సంస్థానమునకును, సంస్థానోద్యోగులకును ప్రతిఫల మపేక్షింపకయే సేవ చేయవలెను. చివరకు స్త్రీలకు సయితము— వారు యువతులైనను, వృద్ధలైనను, సధవలైనను, విధవలైనను— దీనినుండి విముక్తి లేదు. సర్వజనులును, సర్వావస్థలందును సేవ చేసితీరవలసినదే! కిక్కురు మన్నచో కొరడా వ్రేటులను గాని, కారాగారవాసమునుగాని కొని తెచ్చుకొన్నట్లే! జరాభారమున పని చేయజాల నని మొర పెట్టుకొన్నందులకు ఒక అరువదేండ్ల ముసలిదానిని బహిరంగముగ వీథియందు లాఠీలతో మోదుట తా నెరుగుదునని చూడ్గర్ వ్రాసెను.

మహారాజు వేట కేగునప్పుడు కంటకయుత మగు ఘోరారణ్యములలోను, గ్రీష్మాతప తప్త సైకతస్థలము లందును, నిశిత శిలాభరితము లగు పర్వతశ్రేణుల పైనను పరవతోల ప్రజలను

నిర్బంధింతురు. బ్రిటిషు ప్రభుత్వోన్నతోద్యోగులు సంస్థానముల దర్శింప నేగినప్పుడు రైలుమార్గమున కిరుప్రక్కల యందు టెండలోను, వుండువంటి చలిలోను కావలా కాయుకొరకు ప్రజలను నియమింతురు.

బుందీసంస్థానము, నిర్బంధసేవను గూర్చి 1922 వ సంవత్సరములో ప్రకటించిన క్రింది రెగ్యులేషనువలన ప్రజల కిది యెంత బాధాకరమో వ్యక్తమగు కాగలదు:

1. మంగళ్ళు యథాప్రకారము క్రిందచూపిన సేవను చేయవలెను:
(ఎ) సంస్థాన కార్యాలయములందు దీపములను వెలిగించుట.
(బి) ఆ కార్యాలయములకు సున్నము కొట్టుట, వానిని అలుకుట.
2. తెలికలవాండ్రు, సంస్థానావసరములకు తాళ్ళను పేనవలెను. దీనికి ప్రతిఫలముగ వారికి తిండి పెట్టబడును.
7. ఈడిగవాండ్రు వంటచెరుకు సప్లయిచేయవలెను; తాళ్ళనుకూడ పేనవలెను. వారికిని తెలికలవాండ్ర కిచ్చు ప్రతిఫలమే ముట్టును.
8. తమలపాకు బేరగాండ్రు తెరలు, తడికలు సప్లయిచేయవలెను.
9. కసాయివాండ్రు దేవస్థానముల నగారాలకు ఉచితముగా తోళ్ళను సప్లయి చేయవలెను.
10 భిల్లులు, వార్తావహులుగ పనిచేయవలెను; గస్తీ తిరుగవలెను ప్రతిఫలముగ వారికి భోజనము పెట్టబడును.
12. రైతులు, సంస్థాన కార్యాలయములలోని వంటశాలలకు పైకము పుచ్చుకొనకుండ పిడకలు సప్లయిచేయవలెను.
16. సత్రములలోగాని, బహిరంగ ప్రదేశములలోగాని రాత్రిపూట మకాము చేయువారు యథాప్రకారము సుంకము చెల్లించుకొనవలెను.

21. సంస్థానమునకై చేసిన సేవకు ప్రతిఫలముగ తిండి పెట్టబడును. సంస్థానోద్యోగులకు చేసిన సేవకు ప్రతిఫలముగ కూలి యొసగబడును. ఈ సేవ నంతయు తరతరములుగ దానిని గావించుచున్నవారే చేయవలెను. వీరు సేవను చేయ నిరాకరించిన కఠిన శిక్షకు లోనగుదురు.

సంస్థానప్రజ లిట్లు నిర్బంధసేవ క్రింద బాధపడుచున్నారు. వీరి కష్టములను విని, హృదయము కరిగినవాడై దీనబంధుడగు సి. యఫ్ ఆండ్రూస్ మహాశయుడు పరిస్థితులను స్వయముగ తెలిసికొనుటకై రాజపుత్ర స్థానమునకు బయలుదేరెను. కాని, రస వూత సంస్థానపతులు, ఆండ్రూస్ తమ రాజ్యములలో అడుగుపెట్ట వీలులే దనిరి. సత్య ప్రకటన మన్న వీరి కింత భయ మేలనో!"

ఔను భయమే! కాదా, మఱి? సత్యము అగ్నివంటిది. అగ్ని సువర్ణమునకు క్రొంగొత్త మెఱుగుల నమకూర్ప గలదు. అదియే చెత్తచెదారమును భస్మపటల మొనర్పగలదు. సత్యము కూడ ఇంతే. అది ధర్మపరాయణులను పునీత మొనర్పగలదు; అధర్మమార్గానువర్తనులను విధ్వంసమొనర్ప గలదు. ఇందు చేతనే దుర్మార్గులు సత్యముపేరు చెవిసోకినంతనే కంపించి పోదురు. దాని గొంతుకను ఎట్లయిన నులిమివేయవలెనని సర్వశక్తులను వినియోగింతురు. తన పాపకృత్యముల కెల్ల తగినశిక్ష విధింపగలవా డొక డున్నా డని హిరణ్యకశిపునికి తెలియక పోలేదు. కాని, ఆవిషయమును ప్రకటించుట అతని కిష్టము లేదు! అందుచే అతడు ప్రహ్లాదుని అష్టకష్టముల పెట్టెను.

రాజు, దైవాంశ సంభూతుడు కాడనియు; వ్యక్తముగనో, అవ్యక్తముగనో యున్న ప్రజాభీష్టమే అతని రాజ్యపాలనకు కారణమనియు 'పదునాలవ లూయీ' కి తెలియును. కాని, ఈ సత్యమును ప్రచారమొనర్చుట అతనికి సమస్కరింపలేదు. అందుచే అతడు రూసో, వాల్టేర్ మున్నగువారిని బాధపెట్టెను. ఇట్లే నేడు జర్మనీలో నాజీపక్షము, కొరియాలో జపానుసామ్రాజ్యము,...

కాని, సత్యమును శాశ్వతముగ మఱుగు పఱచుట దుస్సాధ్యము. మహాసామ్రాజ్య సాధనసంపత్తి యున్నవారే దానిని రూపుమాప యత్నించి విఫలమనోరథులైరి. ఇక సామాన్య సంస్థానాధీశులు దానిని దాచిపెట్టగలరా?

బేగారి ఇంచుమించుగా బానిసత్వ మని ఠక్కర్‌గారి నిర్వచనము. ఈ యించుమించు బానిసత్వము గాక సిసలైన బానిసత్వముకూడ సంస్థానములలో లేక పోలేదు. 1930 సం॥ములో ప్రకటింపబడిన 'టైమ్సు ఆఫ్ యిండియా ఇయర్ బుక్' లోని వాక్యము లివి:

"1921 వ సంవత్సరపు జనాభాలెక్కల ప్రకారము రసపుత్రస్థానము, మధ్యభారతవర్షములలో 1,60,755 మంది బానిసలు కలరు. వీరిని దరోగాలు, హుజూరీలు, చేలాలు, గోలాలు మున్నగు పేర్లతో పిలుతురు. హిందువులు, మహమ్మదీయులు అను విచక్షణలేకుండ సంస్థానాధీశు లందరి ఏలుబడిలోను వీరు

న్నారు. ఆజన్మాంతమును ఏలికలకు వీరు సేవచేయవలసినదే! ఏవో కొలది జీవితావశ్యములకు వలసినదానికి వినా వీరు అస్తిని సంపాదింప వీలులేదు. వీరి వివాహములను, విడాకులను నిర్ణయించునదియు ప్రభువరేణ్యులే! తదితర సంస్థానములకు వీరు ఆస్తిని సంపాదింప వీలులేదు. వీరి వివాహములను, విడాకులను నిర్ణయించునదియు ప్రభువరేణ్యులే! తదితర సంస్థానములకు వీరు పారిపోయినచో, బలవంతముగ పట్టితేవచ్చును."

జోధపుర సంస్థాన చట్టములోని ఈ క్రిందిభాగములవలన బానిసల స్థితిని కొంతవరకు గ్రహింపవచ్చును:

"యజమాని హోదాకును, అవసరములకును తగినట్లు దరోగాలు సేవచేయక పోయినచో అతడు చట్టసమ్మతముగ వలసిన సేవను చేయించుకొనవచ్చును.

"దరోగాలసంఖ్య యజమానిహోదాకును, అవసరములకును మించినయెడల వలసినవారినే ఉంచుకొని తక్కినవారిని అతడు తగ్గింపవచ్చును." ఈ విధముగ తగ్గింపబడినవారు యజమాని పిలిచినప్పుడెల్ల పనిలోనికి రావలెను. యజమాని గృహమునజరుగు వివాహాది శుభకార్యములలో వచ్చి సేవచేయవలెను. యజమాని కోరినంతకాలము పనిచేయవలెను. తనకు సేవ చేయుచున్నంతకాలమును యజమాని దరోగాలకు తిండి పెట్టవలెను.

"తమ యింట పుట్టిపెరిగిన దరోగాల పుత్రికలను రాజపుత్రులు కన్యాశుల్కముక్రింద ఇయ్యవచ్చును. హోదాగల రాజపుత్రులు దరోగా కుటుంబములనుకూడ కట్నములక్రింద ఇయ్యవచ్చును.

"హోదాకును, అవసరములకును మించి రను కారణముచే ఏలికసేవనుండి తగ్గించుటవలన వేరొకచోట పనిచూచుకొనిన దరోగాల కుమార్తెలనుకూడ కట్నముగా ఇయ్యవచ్చును."

ఈ చట్టము ప్రస్తుతము కాగితముపై లేదు. కాని, దీనిలోని ప్రతి షరతును అమలులో నున్నది. దరోగాలు చదువుసంధ్యలు లేనివారగుటచే వారి కేది రద్దుగావింపబడిన సంగతి యైనను తెలియదు. ఏ ప్రజాహితాకాంక్షియైనను వారికి ఈ సంగతిని తెలిపిన వానికి మూడిన దన్నమాటయే!

ఇట్లే తక్కిన సంస్థానములందును చట్టము లున్నవి. కోటాసంస్థానములో బానిసకులమువా డెవ్వడును సంస్థానోద్యోగములలో ప్రవేశింప వీలులేదు. ఉద్యోగములన్న పెద్దపెద్ద పదవులు కాదు; పోలీసు భటుడుగా గాని, సైనిక భటుడుగా గాని ప్రవేశించుటకు నయితము వీలులేదు. అంతియేకాదు. అది వఱకే సంస్థానోద్యోగములలోనున్న బానిసకులస్థుల నందరిని ఒక్కసారిగా తొలగింపవలసినదిగ కోటాసంస్థానము 1920 సెప్టెంబరు 20 వ తేదీని ఫర్మానా జారీచేసెను!

బికనీరు సంస్థానములో 1921 వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారము చకారు, దరోగా కులజులైన బానిసలు 10,884 మంది యుండిరి. ఐనను, బికనీరు సంస్థానాధిపుడు నానాజాతి సమితికి ప్రతినిధి; వర్సెలీసు సంధిపత్రముపై సంతకపు దారుడు!

ఈ బానిసలను పెట్టు కడగండ్లను రామనారాయణ చౌదరిగారిట్లు వర్ణించిరి: "బహుమానముల క్రిందను, కన్యాశుల్కముల క్రిందను స్త్రీలు, పురుషులు, శిశువులు

బహిరంగముగ చేతుల మార్చుచున్నారు. వారిచే కఠిన మైనట్టియు, నీచమైనట్టియు పనులను చేయించుచున్నారు. తిని వదలిన కూడును, తొడిగి చించిన గుడ్డలను వారి కిచ్చుచున్నారు. * * * వారి వివాహమును, విడాకులను తమ వీలునుబట్టి నిర్ణయించుచున్నారు. ఈ దౌర్భాగ్యులను దండించుట, వారి మానాభిమానములను హరించుట సాధారణ కృత్యములు పోనీ, తప్పించుకొని పారిపోవుద మన్న అదియును సులభము కాదు.

ఈ బేగారి బానిసత్వములు అనాగరకములు, అమానుషములు.

వీనిని రూపుమాపుటకు బదులు సంస్థానాంతర్గత పరిపాలనలో జోక్యము కల్గించుకొనుట సమంజసము కాదని బ్రిటిషు ప్రభుత్వమువారు సాకు చెప్పుట కడుంగడు శోచనీయము. ఏ శ్వేతముఖునైన — చూడ్గర్ గారడీగినట్లు — స్వదేశ సంస్థానములో నవమానపఱిచిన బ్రిటిషు ప్రభుత్వమువా రిట్లే సరిపెట్టుకొందురా ?

కాని, బ్రిటిషు ప్రభుత్వ దృష్టిలో తెలుగు నలుపులకు హాస్తిమశకాంతర మున్నదిగదా !

# విద్యాసౌకర్యములు

తదితర దేశములతో సరిపోల్చిచూడ బ్రిటిషు ఇండియాలోనే విద్య తక్కువ. ఇక, స్వదేశసంస్థానములలో దాదాపు మృగ్యము.

యావద్భారత దేశమున (1921 వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారము) చదువను, వ్రాయను నేర్చినవారు నూటికి 8 మంది మాత్రమే కలరు. ఇక, భారత సంస్థానములలో నూటికి కేవలము 4 గురే !

కారణము ? విద్యాసౌకర్యశూన్యతయే ! ఈవిషయమై చూడ్గర్ ఏ మనుచున్నారో వినుడు : "సంస్థానములలో విద్యాసౌకర్యములు దాదాపుగ సున్నకు సున్న; హాళ్ళికి హాళ్ళి. విద్యావిధానమంతయు కడు సంకుచితముగ నున్నది. కావలె ననియే దీని నిట్లు గావించుచున్నా రనికూడ చెప్పవచ్చును. మొత్తము 563 సంస్థానములలోను కేవలము 20 మాత్రము ఎన్నదగిన విద్యాసౌకర్యములను కల్పించుచున్నవి." ఎక్కడి 563 ?

ఎక్కడి 20 ? అదేదో 'నముద్రములో...' శాస్త్రమువలె నున్న దిది.

పాటియాలా మహారాజుగారు నరేంద్రమండలి కధ్యక్షులు. వీరు భారత భావిరాజ్యాంగవిధానమునుగూర్చి చీటికి మాటికి ప్రకటనలు చేయుచుందురు. ఇట్టి పాటియాలా మహారాజుగారి సంస్థానమున విద్యాసౌకర్యము లెట్లున్నవో గమనింపుడు: ఆ సంస్థానములో ప్రతి 15 గ్రామములకు ఒక్క పాఠశాలమాత్రమే కలదు. మొత్తము జనసంఖ్యలో నూటికి ఒక్కొక్కడు మాత్రమే విద్య నభ్యసించుచున్నాడు.

ఇంత లక్షణముగ నున్నది, నరేంద్రమండలాధ్యక్షుని సంస్థానములోనే విద్యావ్యాప్తి !

రామనారాయణ చౌదరిగారు తమ 'మాడరన్ రివ్యూ' వ్యాసములో విద్యావిషయమునుగూర్చి పేర్కొనిన అంకె లివి:

| సంస్థానము. | ఒక్క పాఠశాల. | | |
|---|---|---|---|
| | ఎంతమంది వ్యక్తులకు ? | ఎన్ని చదరపు మైళ్ళకు ? | ఎన్ని గ్రామములకు ? |
| అళ్వారు ... | 7,011 | 31 | 17 |
| జోధపూరు ... | 12,166 | 230 | 27 |
| బికనీరు ... | 10,307 | 364 | 33 |

| సంస్థానము | | సంస్థానాధిపతి స్వంతఖర్చు (నూటికి) | విద్యాశాఖకై ఖర్చు (నూటికి) |
|---|---|---|---|
| బికనీరు | ... | 11 వంతులు | $1\frac{1}{2}$ వంతులు |
| జోధపూరు | ... | 16 ,, | 3 ,, |
| ఆళ్వారు | ... | 50 ,, | 1 ,, |

ముంజేతి కంకణమును అద్దముతో పనియును లేదు; వినుగు జెందక పై యంకెలను సరిగ జదివిన వారికి వ్యాఖ్యానముతో అగత్యమును లేదు.

విద్యా సౌకర్యము లిట్లు శూన్యమైనను కోతలకు కొంత లేదు. కీ. శే. నవానగరు జాంసాహెబుగారు ఒకప్పుడు ప్రొఫెసర్ రెయిలీతో తమ సంస్థానమునందు పాఠశాల లేని గ్రామమే లేదని చెప్పిరి. ఈ సంగతిని విని, 'మాంచెష్టర్ గార్డియన్' పత్రిక 'రాన్‌జీ'ని అభినందించెను. అసలు సత్య మేమన, నవానగరు సంస్థానమున గల 687 గ్రామములలో కేవలము 184 గ్రామములలోనే పాఠశాల లున్నవి! ఆ పాఠశాల లైనను చాలవఱకు నామమాత్రమైనవే!!

సంస్థానములలో గల విద్యాసౌకర్యములను గూర్చి చూడ్డర్ ఇట్లు చక్కగ వ్రాసెను:

"కేవలము ప్రదర్శనముకొఱకు విధిలేక మెడకు తగిలించు కొన వలసివచ్చిన బండగా సంస్థానవిద్యాశాఖను మహా రాజులు పరిగణింతురు. విద్యయనిన వారికి అభిరుచియే లేదు. ఈ విద్యయేగదా పీడాకరులగు వ్యక్తులను తయారు చేయును!

"పైగా, ఎంత ఖర్చు! నిష్ప్రయోజకమైన విద్య నిమి త్తము మహారాజులు నూటికి రెండుపాళ్ళకన్న హెచ్చుగ వెచ్చింపగలరా?

"వారికి ఎన్నో మోటార్లు కావలెను; ఎన్నో రాణ్మంది రములు కావలెను. కేవలము సంస్థానముల ముఖ్యపట్టణముల లోనే గాక, సిమ్లా మొదలగు శీతపర్వతములపై కూడ దివ్య హార్మ్యములు కావలెను. ఇటీవలనే అళ్వారు మహారాజు గారు ఆబూపర్వతముపై ఒక రాజప్రాసాదమును నిర్మించిరి. దీనికై 3,50,000 పౌండ్లను వెచ్చించిరి ఈ మందిరము, పొలిటికల్ ఏజెంటు నుడివినట్లు, 'అరేబియన్ నైట్సు' కథల లోని వైభవోజ్జ్వలతను స్మరణకు దెచ్చుచుండును. వైస్రాయి గాని, గవర్నరుగాని, పొలిటికల్ ఏజెంటుగాని, తదితర ప్రముఖు డెవడైనగాని సంస్థానమును దర్శింప నేగినచో క్రొత్త సున్నముతోను, నూతనాలంకారముతోను విలసిల్లుచున్న పాఠశాల నొకదానిని చూపింతురు. మఱియెన్నో పాఠశాలలు కాగితముపై క్షణములో సృష్టి యగును. అతిథియు ప్రజల

శ్రేయోభివృద్ధికై పాటుబడుచున్నందులకు మహారాజును విధ్యుక్తముగ భూషించును. సాదరముగ సత్కరింపబడిన పత్రికా ప్రతినిధులు ఈ భూషణవాక్యములను దశదిశలకును తంతీవార్తల ద్వారా తెలియజేతురు. ఆ మఱునాడే 'ఫలానా మహారాజుగారి విద్యాభిమానము,' 'ఫలానా సంస్థానములో విద్యావ్యాప్తి' అని నల్లని పెద్దఅక్షరముల శీర్షికలతో పత్రికలు వెలువడును. ఈ నల్లని పెద్దఅక్షరములు సత్యమును కళంకిత మొనర్చుచున్న వని యెవరి కెఱుక ? పరిస్థితు లన్నియు సరిగ తెలిసినవా డెవడైన విమర్శనకు పూనుకొనినచో, అతడు అల్లరి చిల్లరివా డని పలుకుదురు. అతనికి కారాగారవాస శిక్షను విధించుట, లేదా అతనిని దేశభ్రష్టుని గావించుట తగు నందురు.

"సంస్థానములలో ఇట్టి విమర్శన రాజద్రోహ మగును. ఇక, బ్రిటిషు యిండియాలో దీనిని పెద్ద నేరముక్రింద భావించి, 5 వత్సరములవఱకు కారాగారవాసము విధించినను విధింపవచ్చును. "విద్యావిషయమున స్వదేశ సంస్థానము లన్నియు సహారాను బోలునని చెప్పదగును. కాని, ఈ యెడారిలో కొన్ని జలాశయములు లేకపోలేదు. అవి మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిన్ మొదలైనవి."

# వైద్యసహాయము

వైద్యసహాయము, విద్యాసౌకర్యములకు 'డిటో' అని చెప్పిన చాలును. కాని, యింత మాత్రమున పాఠకులు సంతృప్తినందుదురా ? ఇతరు లెవరైన ఇట్లు ముక్తసరిగ చెప్పిన నేనే సంతృప్తి పడను. ఇట్టియెడ పాఠకవరేణ్యులు సంతృప్తినందగలర్గని నే నెట్లు భావింపగలను ? ఎవరైనను విన్నమాట నెల్ల విశ్వసింపరాదు. ఎంత చిన్నవిషయమునైనను, సత్యమని నమ్మూటకు ముందు తఱచి చూడవలెను. ఈ సూత్రము ననుసరించియే నే నింత దనుక ప్రత్యల్పవిషయమును నిరూపించుటకు నిష్పాక్షికులైన ప్రముఖు లొసగిన యభిప్రాయములను పేర్కొంటిని. ఇక ముందుగూడ ఇట్లే కావింతును.

ఇక, అసలు విషయము : రామనారాయణ చౌదరిగారి 'మాడరన్ రివ్యూ' వ్యాసములోనివే క్రింది అంకెలు.

| సంస్థానము | ఒక్క వైద్యాలయము | | |
|---|---|---|---|
| | ఎంతమంది వ్యక్తులకు? | ఎన్ని చదరపు మైళ్ళు | ఎన్ని గ్రామములకు |
| ఆళ్వారు ... | 70,115 | 314 | 177 |
| జోధపూరు ... | 75,000 | 1,400 | 81 |
| బికనీరు ... | 47,120 | 1,665 | 154 |

| సంస్థానము | సంస్థానపతి స్వంత ఖర్చు (నూటికి) | వైద్యసహాయమునకు ఖర్చు (నూటికి) |
|---|---|---|
| ఆళ్వారు ... | 50 | ·3 |
| జోధపూరు ... | 16 | 2·25 |
| బికనీరు ... | 11 | 1·4 |

రాజపుత్రస్థానపు సంస్థానములవలెనే దాదాపుగ తక్కిన వన్నియును! సంస్థానపతి స్వంతఖర్చులో పదియవభాగమైనను ప్రజలకు వైద్యసహాయమొనర్చుటకును, వారిని మృత్యుముఖమునుండి తప్పించుటకును వినియోగముకాదు. బడ్జెటులో వైద్యశాఖ కని ప్రత్యేకింపబడిన స్వల్పధనమైనను పూర్తిగా ప్రజోపయోగార్థమై వెచ్చింపబడునా? అదియును లేదు?

'ప్రిన్సిలీ యిండియా' పత్రిక (27-8-33) లో జాభ్వాను గూర్చి ఇట్లున్నది: "సంస్థాన వైద్యాలయమున ఔషధముల ఖర్చును తగ్గించిరి. రోగులు మందులకై గోలపెట్టుదురు. కాని, వారికి రంగునీళ్ళను పోయుదురు. పూర్వము జాభ్వాకై 2 వేల రూప్యములకుపైగా ఖరీదు చేయు మందులను తెప్పించెడివారు. ఇప్పుడు 1750 రూప్యముల విలువచేయు మందులనే తెప్పించుచున్నారు. వీనిలో మంచిమందుల నెల్ల రాజాసాహెబుగారే తీసికొందురు. రోగుల సంఖ్య హెచ్చుచున్నది. కాని, మందులు అంతకంతకు తగ్గుచున్నవి.

'ప్రిన్సిలీ యిండియా' పత్రికలోనే (20-8-33) కుషల్ ఘర్ సంస్థానమును గూర్చి యిట్లున్నది:

"సంస్థానములో ఒక్క వైద్యాలయము మాత్రమే కలదు. అదియును నామమాత్రముననే! సాలినా 12 వందలో 15 వందలో రూపాయలను ఖర్చుచేసి ఔషధములను తెప్పించుచున్నారు. ఇవి ప్రజావశ్యకములకు సరిగ సరిపోవు. కాని, వీనిలోనే మంచిమందుల నన్నిటిని— మొత్తములో దాదాపుగ సగముఖరీదు చేయువానిని— సంస్థానపతియు, అతని కుటుంబమువారును ఉపయోగించుకొనుచున్నారు. ఇక మిగిలిన వానితోనే 35 వేలమంది ప్రజలు సంతృప్తిపడవలెను. వైద్యాలయపు డాక్టరును, కాంపౌండర్లను అన్నప్పుడెల్ల సంస్థానాధీశుడో, అతని కుటుంబమువారో పిలిపించుచుందురు.

ఇందుచే ప్రజలు రోజంతయు పడియుండికూడ చికిత్సను బడయు నేరకయే గృహోన్ముఖులు కావలసివచ్చుచున్నది!"

ఇంతకన్న ఘోరము కొన్ని సంస్థానములలో జరుగుచున్నది. వానిలో కొన్నిటియందు సంస్థానపతి పెంపుడు కుక్కల మందు ఖర్చు నంతయు పశువైద్యశాఖ లెక్కలలో జేర్చుదురు. మఱికొన్నిటియందు కేవలము సంస్థానపతి కుక్కల నిమిత్తమే పశువైద్యశాఖను కల్పింతురు! ఎంతదారుణ మిది! ఎంత...

అన్నట్లు అనేక సంస్థానములలో వైద్యాలయములు లేకపోయినను కల్లు, సారాయి, గంజాయి, నల్లమందు మొదలైన మత్తు పదార్థముల దుకాణములు మాత్రము విరివిగా నుండును. ఇందుకు ఉదాహరణముగా నవానగరు సంస్థానమును చూపించ వచ్చును. ఈ సంస్థానములోని వైద్యాలయములు 16 మాత్రమే! కాని, సారాయి దుకాణములు 29! నల్లమందు షాపులు 18!!

ఈ ప్రకరణము, క్రిందటిదానికి 'డిటో' యనుచు ప్రారంభించితిగదా! తిరిగి 'డిటో' గానే చూడ్డర్ వాక్యములతో దీనిని ముగింతును. అత డిట్లు వ్రాసెను:

"గ్రామములకు అందుబాటు దూరములో వైద్యసహాయము దొరుకుటలేదు. రోగులు—చాల జబ్బుగ నున్న రోగులు—ప్రాణాపాయకర స్థితిలో నున్న రోగులు—నరియైన రోడ్లు లేకపోవుటచే కుద్దుకొనుచుండు ఎద్దుబండ్ల నెక్కి

ఆసుపత్రులకు వెళ్ళవలెను. * * * ఈ యిబ్బందిని పడ లేక నూటికి 90 మంది గ్రామస్థులు కూరగాయవైద్యుల సహాయమును అపేక్షింతురు. పాపభీతి నెరుగని ఈ వైద్యులును ప్రజలను మోసపుచ్చి, డబ్బు లాగుచుందురు. ఒక వేళ చికిత్సాలయము అందుబాటులోనున్నను డాక్టర్ల దర్శనము పాపము, రోగికి సాధారణముగ లభింపదు! సంస్థానపతి కుటుంబసేవలలోనే డాక్టర్లు తరచుగ నిమగ్నులై యుందురు. "స్త్రీ-శిశు సంరక్షణాలయములు నూటికి 5 సంస్థానములలో నైన సరిగ లేవు. సుశిక్షితులైన మంత్రసానులు దొరకుట దుర్ఘటము. ఇక్కారణముననే ప్రసూతికాలమున పెక్కుమంది స్త్రీలు మరణించుటయు, ఎందరో మృతశిశువులు జనించుటయు సంఘటించుచున్నది. ఎట్లో గండము తప్పించుకొన్న స్త్రీలకైనను ఆరోగ్యము శాశ్వతముగ భగ్నమగుచున్నది. ఈ విషయములకు సంబంధించిన అంకెలు ఘోరములు; హృదయ విదారకములు! దీనుల ఆర్తనాదములు మన సంస్థానాధీశుల చెవిని బడవు. దౌత్యసంరంభములో, నృత్యగానాదులలో చెవిని బడుటకైనను అవకాశ మేది? తమ మొర, ఘోష, విలాపము, సంస్థానపతుల చెవిని బడినను పడకున్నను, వారి భోగాతిశయముల కన్నిటికిని ప్రజలు ధనరాసులను సమర్పించి తీర వలసినదే!

"గ్రామస్థులు — జనాభాలో ముప్పాతికవరకున్న గ్రామస్థులు—సంస్థానాదాయములో నూటికి 80 పాళ్ళను సమకూర్చ

గ్రామస్థులు – ఈపణ్మాత్రమైనను వైద్యసహాయమును బడయలేకున్నారు.

"ఐనను వైద్యాలయములకును, స్త్రీ – శిశుసంరక్షణాలయములకును శంకుస్థాపనమహోత్సవములు జరుపబడుచున్నట్లు మనము సాధారణముగ వినుచుందుము. కాని, శాసనసభలవలె వీని బ్రతుకును కేవలము కాగితము మీదనే! భూపతనము గాకమునుపే అసువులను గోల్పోవుచున్న వేనకువేల శిశువుల కివి సంజ్ఞారూపకములు కాబోలు!"

# వాక్స్వాతంత్ర్యము

"మేము తమ వద్దకు గస్తీనిషాన్ ౫౩ తా. ౧౭ డై. ౧౩౩౯ ఫ. స గుఱించి మనవి చేయుటకై వచ్చియున్నాము. ఈగస్తీ మ. ఘ. వ. నిజాము ప్రభుత్వమువారి ప్రజలకు వారి జన్మసిద్ధ మగు వాక్స్వాతంత్ర్యమును నిరాకరించుచున్నది. ఈ స్వాతంత్ర్యము ఏదేశమందైనను సరే ప్రజల నైసర్గికములగు హక్కులలో నొకటి యని ప్రపంచములోని ప్రతినాగరక ప్రభుత్వమును అంగీకరించియున్నది. *

"నిజాము ప్రభుత్వమువారు కూడ ప్రజలకీ హక్కు గలదని అంగీకరించియే యుండిరి. ౧౧ మొహరము ౧౩౨౦ హిజ్రి (౯ ఆబాన్, 1330 ఫ.) నాటి ఫర్మాను జారీ అగువరకు రాష్ట్రపు ప్రజలు ఈ హక్కును నిరాటంకముగ అనుభవించుచునే యుండిరి. ఈ ఫర్మానైనను అన్నివిధములగు బహిరంగ

* ఈ గస్తీ నిషాన్‌ను ఇటీవల రద్దుపరచిరి కాని, ఇది నామమాత్రముగనే! ఇది రద్దుకాక పూర్వము కంటె ఇప్పుడు పరిస్థితులు మరింత ఘోరముగ నున్నవి.

సభలవిషయమున నిర్బంధముల గల్పించి యుండలేదు. సాంఘిక, మత, విద్యా విషయికాది సభలతో ఆ ఫర్మానున కెట్టి జోక్యము లేకుండెను. కాని ప్రస్తుతపు గష్తి (౫౩) ప్రకారము బహిరంగసభ యెట్టిదైనను సరే దానికి ప్రభుత్వాంగీకారము తప్పక కావలయును. ఈ గష్తి నైసర్గిక హక్కులలో నొకటగు వాక్స్వాతంత్ర్యమును ఈరాష్ట్రపుప్రజలకు లేకుండ చేసినది ఇట్టిహక్కు ఈదేశపు ప్రజలలోని ప్రతివ్యక్తికి కలదని మన ప్రభువుగారి ఉన్నతన్యాయస్థానము (హైకోర్టు) వారు ఒకప్రక్కన తీర్మానించి యుండగా (దక్కను లా రిపోర్టు: సం. ౨౧: పుట ౩౦౫: ప్రభుత్వము — ఖాజీ మహ్మద్దీను అను నభియోగము), వేరొక ప్రక్కన మన ప్రభుత్వమువారే ఈ గష్తిద్వారా ఈ హక్కును నిరాకరించుచున్నారు!

"ఇట్టి కఠినమగు శాసనమును ఎందుచేత నిర్మింపవలసి వచ్చినదో ప్రభుత్వమువారు కారణము చూపియుండ లేదు. ఈ రాజ్యమునందు ఈ దినమువరకు ఒక రాజద్రోహపు అభియోగమైన న్యాయస్థానములలో విచారింపబడలేదు. ఒక వ్యక్తియైన నేటివరకు యిట్టి నేరమునకై శిక్షింపబడి యుండలేదు. కావున ఈ రాష్ట్రపుప్రజలు ఇట్టి కఠినశాసనము నిర్మించుటకు ఏమాత్రము కారకులు కాలేదని ఘంటాపథముగ చెప్పగలము. ప్రపంచములోని ఏ నాగరక ప్రభుత్వమును శాంతపరిస్థితులలో నిట్టి శాసనము చేసియుండలేదు!

"మరియొక మనవి. ఇట్టి కఠిన శాసనములను నాగరక ప్రభుత్వమువారు అసాధారణపరిస్థితులలో మాత్రమే జారీచేయుదురనియు, అదియే శాసననిర్మాణము యొక్క ముఖ్యసూత్రమనియు విజ్ఞులు చెప్పుచున్నారు. అట్టి పరిస్థితులలోనైనను, ఈ విధమగు శాసనములను కొంతకాలముకొరకు మాత్రమే జారీచేసెదరు; శాశ్వతముగా నుంచరు. ఇట్టి శాసనముల నిర్మించునపుడు నాగరక ప్రభుత్వములవారు వాని నిర్మాణములకు ఏ కారణములు కలిగినవో, వానిని వివరించి ఈ శాసనము యింతకాలము వరకు మాత్రమే యుండు నని కాలనిర్ణయము చేయుట ఆచారమైయున్నది. ఇంతేకాదు. ఇట్టి కఠినశాసనములను దేశమంతటను అములులో పెట్టరు. ఏ దేని కొంత ప్రాంతములో (ఎచ్చట నిది అత్యవసరమని తలంపబడునో అచ్చట) మాత్రము అములులో పెట్టెదరు. ఏరాష్ట్రమునందును నిట్టి కఠినశాసనము సర్వప్రాంతములందును, సర్వకాలములందును అములులో నుండవలయు నని ఏ నాగరకప్రభుత్వమువారు ఆజ్ఞాపించినట్లు కని, విని యెఱుగము!

"కేవలము మతవిషయికములును, విద్యావిషయికములును, సాంఘికములును నగు సభలను ఆపిన ఉదాహరణము లెన్నియో కలవు. గ్రంథాలయముల వార్షికోత్సవములను, వర్తకసంఘముల సభలను, సంఘసంస్కారసభలను సమావేశ

పరుప ప్రభుత్వమువారు సెలవీయ నిరాకరించిరి!” అని నైజాము ప్రభుత్వపు పోలీసుశాఖా మంత్రిలగు లెఫ్టి నెంటు కర్నలు సర్ రిచర్డు ఛెన్విక్సు ట్రించుగారి వద్దకు 1933-వ సం॥ము ఫిబ్రవరి 8-వ తేదీని శ్రీయుత రామచంద్రనాయకు ఎం. ఏ., బారిష్టరుగారి అధ్యక్షతక్రింద రాయబార మేగిన సంఘమువారు మనవి చేసికొనిరి.

హైదరాబాదు వలెనే తక్కిన సంస్థానములును! దేనియందును ప్రజలకు వాక్స్వాతంత్ర్యము లేదు. ఆళ్వారులో రాజకీయములనుగూర్చి ఉపన్యసించిన 5 సంవత్సరముల కఠిన శిక్షయు, రెండు వేలరూప్యముల జరిమానాయు విధింపవచ్చును. సంస్థానమునుండి బహిష్కరింపవచ్చునుకూడ! ఇంచుమించుగ నిట్లే జోధపూరు, జాంనగరు, బికనీరు...

వాక్స్వాతంత్ర్యము శూన్యమగుటవలన సంస్థాన ప్రజలు తమ కష్టసుఖములను లోకమునకు వెల్లడింపలేరు. బ్రిటిషు ఇండియాలో సభలను జరుపుకొన గూడదా? అని ప్రశ్నింతు రేమో! కొంతవఱ కిట్లే జరుగుచున్నది. క్రిందటి అఖల భారత సంస్థాన ప్రజాసభ డాక్టర్ భోగరాజు పట్టాభిసీతా రామయ్యగారిఅధ్యక్షతక్రింద కరాచీలో సమావేశ మయ్యెను. నిజాంరాష్ట్ర ప్రథమ రాజకీయసభ అకోలాలో జరిగెను. పంజాబు సంస్థాన ప్రజాసభ 1931 లో ఠక్కర్‌గారి అగ్రాసనాధిపత్యము క్రింద సిమ్లాకొండలపై సమకూడెను. కాని,

బ్రిటిషుయిండియాలోనై నను రక్షణకలదా? 5 సంవత్సరముల వఱకు శిక్షవిధించుట కిక్కడ సంస్థానాధీశుల రక్షణ చట్టము (Princes' Protection Act) లేదా?

సంస్థానములలో వాక్స్వాతంత్ర్య మెంతో, పత్రికా స్వాతంత్ర్యము కూడా అంతే! ప్రజల కష్టసుఖములను నిష్పందేహముగ, నిర్మొగమాటముగ, నిర్భయముగ ప్రకటించు వార్తాపత్రిక సంస్థానములలో ఎక్కడను లేదనియే చెప్ప వచ్చును. ఏమాత్రము ప్రజా పక్షపాతమును చూపించినను, లేక రాచకీయములను గురించి శ్రద్ధ వహించినను పత్రికను వెంటనే కట్టివేయించుదురుగదా! ఇక, సంస్థానములలో సరియైన పత్రిక లుండు టెట్లు? ఈ ప్రశ్నలో అత్యుక్తి లేదు. అత్యుక్తి నిజముగనే లేదని నిరూపించమందురా? అయినచో వినుడు: గోండల్ సంస్థానములో "ది కథియవాడ్" అని ఒకే ఒక వారపత్రిక యుండెడిది. రాజకీయములను చర్చించెనను కారణమున 1924 లో దానిని సంస్థానమువారు ఆపు చేయించిరి. అంతే! తిరిగి నాటికి నేటికి ఆ సంస్థానములో మచ్చున కొక పత్రికయైనను లేదు! బికనీరులో కూడ ఇంతే! అక్కడ "వృష్కరేందు" అని ఒకే ఒక మానవపత్రిక యుండెడిది. ఆ పత్రికాధిపతి సంస్థానమువారి కఠిన నిబంధనల నన్నిటిని పాటింపలేక, పత్రికను కట్టివేసెను. ఇక, నవానగరు సంస్థానము స్థితి ఇది: ఇక్కడ "సోషియల్ సర్వెంట్"

అను పేరుతో ఒక మానవపత్రిక యున్నది. ఆ పత్రికను ప్రక టించుటకు ముందు దాని ఎడిటర్ క్రింది హామీమీద సంత కము పెట్టవలసి వచ్చెను: "అర్జీదారు రాజకీయ విషయ ములను ఎత్తుకొనరాదు; ప్రజలమీద విద్వేషముగాని, అన హ్యతగాని కలిగించు విషయములను ప్రచురించరాదు... ఇందుకు భిన్నముగా జరిగిన అతడు మహారాజునకు అయిదు వందల రూపాయల జరిమానా చెల్లించు కొనును." ఈ హామికి భిన్నముగా జరిగెనో లేదో నిర్ణయించునది కోర్టువారని భావింతురేమో! కాదు! మహారాజుగారి పొలిటికల్ సెక్రె టరీ! అతడి తీర్పుపైన అప్పీలు చేసుకొనుటకు కూడ అవకా శములేదు. ఇంతటి కఠిన నిబంధనలకు లోనై, ఇంతటి హైన్య మున కొడబడి పత్రికలను నడుపు టెట్లు? నిరంకుశత్వము నగ్న తాండవము చేయు ఉత్తర హిందూస్థాన సంస్థానములలోనే గాక, కొంతవరకు సత్పరిపాలనమునకు వాసిగన్న మైసూరులో కూడ పత్రికలస్థితి ఇంత ఘోరముగనే యున్నది. ఇటీవలనే ఈ సంస్థా నములో కాంగ్రెసు పట్ల అభిమానమును చూపు "ప్రజా మత" అను కన్నడ పత్రిక డిక్లరేషన్ రద్దుచేసిరి: ఇంతే కాదు! ఆ పత్రిక కార్యస్థానాన్ని హుబ్లీకిమార్చి, ప్రచురణ సాగించగా, దాని ప్రతులను జప్తుచేసిరి.

సంస్థానములలో నిట్లు సరియగు పత్రిక లుండుటకు అవకాశ ములు లేవు సరిగదా బ్రిటిషు యిండియాపత్రికలైనను సంస్థాన

పరిపాలనా క్రమమును విమర్శింప దొడగినచో, దానిని కూడ వెంటనే బహిష్కరింతురు. ఎన్నో పత్రికల నిట్లు బహిష్కరించిరి. జయపూరు సంస్థాన మొకప్పుడు 'లీడర్' 'బొంబాయి క్రానికల్', 'ప్రతాప్', 'కర్మవీర్', 'మాధురీ', 'సరస్వతి' పత్రికలను ఒకేతూరిగా బహిష్కరించినది. గోండల్ సంస్థానము లోనికి క్రింది పత్రికలలో ఏదియు రా వీలు లేదు :

| పత్రిక. | | ప్రచురణస్థలము. |
|---|---|---|
| (1) సౌరాష్ట్ర | ... | రాజ్‌పూర్ |
| (2) ఫూల్ ఛాబ్ | ... | రాజ్‌పూర్ |
| (3) రోషణి | ... | రాజ్‌పూర్ |
| (4) జన్మభూమి | ... | బొంబాయి |
| (5) ప్రజాబంధు | ... | అహమ్మదాబాదు |
| (6) ప్రజామిత్ర | ... | బొంబాయి |
| (7) ప్రజామిత్ర కేసరి | ... | బొంబాయి |
| (8) కథియవాడ్ వోపీనియన్ | ... | రాజకోట |
| (9) జాగ్రతి | ... | రాజకోట |
| (10) వాఫ్‌దార్ | ... | నవ్‌సారి |
| (11) ఆశకార్ | ... | సూరత్ |
| (12) టాప్ | ... | సూరత్ |
| (13) బొంబేబజార్ భావ్ | ... | బొంబాయి |
| (14) కథియవాడ్ | ... | బొంబాయి |
| (15) పోవ్ పత్రిక | ... | బొంబాయి |

ఇటీవలనే 'బొంబాయి క్రానికల్' పత్రిక తమ సరిహద్దుల లోనికి రా వీలులేదని నైజాముగారు ఫర్మానా జారీచేసిరి. నా "నేటిరష్యా"ను బహిష్కరించుచు 1938 ఫిబ్రవరిలో ఒక ఫర్మానా వెలువడినది. ఫర్మానామాట యెట్లున్నను, 'క్రానికల్'ను బహిష్కరించుటకు గల కారణ మేమో చూచాయగా నైన తెలుపకుండుటయే విచిత్రము. *

అసలు విచిత్రములకు సంస్థానములు పుట్టినిండ్లు. ప్రజలు కటిక దారిద్ర్య మనుభవించుచుండ, వారి పరిపాలకులు కుక్కలపై మోజుపడుట ఒక విచిత్రము. సకలప్రపంచమును "స్వేచ్ఛ! స్వాతంత్ర్యము!!" అని పలవరించుచుండ, 'బేగారి' ప్రబలి యుండుట ఇంకొక విచిత్రము. నిర్బంధోచిత విద్యావిధానము సర్వజనాంగీకారము నొందుచుండ, పది-పదిహేను గ్రామము లకు ఒక పాఠశాలయైన లేకుండుట మఱొక విచిత్రము.

---

*ఈ సంవత్సరం ఆగష్టు 15 సెప్టెంబరు 15 తేదీల మధ్య హైదారాబాదు సంస్థానములోనికి రావీలులేదని మొత్తము 23 పత్రికలను కాబోలు బహిష్కరించిరి. పత్రికల బహిష్కారము విషయములో ఈ సంస్థానమును గురించి ఒక కథ చెప్పుచుందురు. ఇది నిజమో, కాదో నిర్ధారణగా చెప్ప లేముగాని, ఉన్న పరిస్థితులనుబట్టి దీనిలో విపరీతమేమియు లేదు. హైదరాబాదులో ఎప్పుడైననుసరే మొత్తము నూరు పత్రికలమీద బహిష్కార ముండునట! నూటఒకటవ పత్రికను బహిష్కరించినంతనే, వరసలో మొదటి పత్రికమీద ఆంక్ష తొలగిపోవునట! ఈ విధముగా ఎప్పటి కప్పుడు నూరు సంఖ్యకు భిన్నము రాకుండునట!

స్వేచ్ఛావ్యాపారసూత్రము ధర్మసమ్మత మని పరిగణింపబడు చుండ, దైనందిన జీవితావశ్యకములను గూడ ఇజారా పాడుట వేఱొక విచిత్రము. ఇట్టి విచిత్రములముందు ఈజిప్టియన్ పిరమిడ్లు, పైసా లీనింగ్ టవర్, న్యూయార్కుస్కై స్క్రేపర్లు ఆగ్రా తాజమహాల్ మున్నగునవి ఏపాటివి?

# తీర్పు

తప్పుచేసిన వానిని కోర్టు కీడ్చుట మామూలు. కాని మహా రాజులను— వా రెట్టి దుర్నయము లొనర్చినను—కోర్టు కీడ్చుటకు వీలులేదు. "రాజు చట్టమునకు అతీతుడు" (The King is above Law) గదా! కాని మహారాజులైనను తప్పు చేసి నప్పుడు ప్రజాభిప్రాయము (Public Opinion) అను కోర్టు నుండి తప్పించుకొనలేరు. ఇప్పుడు మనము సంస్థానపతులను 'ప్రజాభిప్రాయము' అను ఈ కోర్టులోనికి రప్పించి వారిని గూర్చి కొందరు జడ్జీలు చెప్పు తీర్పులను విందము గాక! మేయో బూతుల పుస్తకమునకు "సావెల్ జిమాండ్" అను మారుపేరుతో చక్కని జవాబును వ్రాసిన అమెరికను దేశీ యుడు, మొదటి జడ్జి:

"ఏదో కొన్ని సంస్థానములు మాత్రము సలక్షణముగ పరిపా లింప బడుచున్నవి. తక్కిన పెక్కింటిలో నిరంకుశాధికారము అప్రతిహతముగ కొనసాగుచున్నది.

"ఇప్పటికిని పెక్కుమంది మహారాజులు కాలానుసరణి మార్పు జెందుటకు అంగీకరించుటలేదు. వారు ఏనుగులను, సింహము

లను వేటాడుదురు; వైభవోపేతముగ జీవింతురు; దేదీప్య మానమైన యుత్సవములను జరుపుదురు; నేత్రోత్సవకర మైన ప్రదర్శనముల నేర్పాటుగావింతురు; భోగకన్యలతో నానందింతురు; జరీవస్త్రములను ధరింతురు, సలాములతోను, నోరు తిరుగని బిరుదములతోను పొంగిపోదురు."

"నేకెడ్ ఫకీర్" గ్రంథకర్త పార్లమెంటు సభ్యుడు అయిన రాబర్టు బెర్నీస్, రెండవ జడ్జి:

"పెక్కుమంది సంస్థానాధీశులు రాబడిలో అధికభాగమును స్వీయోపభోగములకు వెచ్చింతురు. ఇంగ్లండు నేటికిని ప్రజా స్వామ్య పక్షపాతమును, స్వాతంత్ర్య ప్రేమను గోల్పోవలేదు. ఇట్టి యింగ్లండునకు ప్రియమైన సిద్ధాంతము లన్నిటికి పూర్తిగ విరుద్ధముగ మహారాజులకు తమ ప్రజలను ఉరితీయుటకును, నిష్కారణముగ నిర్బంధించుటకును తగిన నిరంకుశాధికారము లున్నవి."

ఈ గ్రంథకర్తయే కరాచీనుండి ఇంగ్లండులోని ఒక మిత్రునికి ఉత్తరము వ్రాయుచు, ఇట్లు అనెను:

"ఇంగ్లండులో ఈ సంస్థానాధిపతుల ఘనతర ఆతిథ్యమును స్వీకరించువారు, వీరిని గురించిన వివరములను తెలుసుకొని యుండుట అవసరము—సంస్థానాధీశుడు లండన్‌లో 1500 పౌనులను ఖర్చుపెట్టి ఒక విందును చేసెను. ఈ విందు ఖర్చు ఎచ్చటినుంచి వచ్చెనో చెప్పగలుగుదువా? అతని సంస్థానము

లోని కర్షకుల రక్తమాంసములనుండి! సకలభూషణ విభూషితు లైన వీరి మోటారు కారులకును, రాజప్రతినిధుల నిమిత్తము వీరు ఏర్పాటు చేయు షికారీ పార్టీలకును, యూరప్ రాజధానీ నగరములలో వీ రిచ్చు గొప్పగొప్ప విందులకును అగుచున్న ఖర్చు వీరి సంస్థానములలో ఆలుబిడ్డలకు కడుపునిండ కూటిని సయితము పెట్టలేకుండనున్న నిరుపేదలదగ్గరినుండి వసూ లగు చున్నది!

"వీరిలో కొందరు యూరప్ ఖండములో శతాబ్దముల క్రిందట రాజ్య మేలిన నిరంకుశ ప్రభువులను మరపింతురు."

మాజీ భారత శాసనసభాసభ్యుడగు రంగయ్యర్, మూడవజడ్జి:

"ఒక్క వ్యక్తి పరిపాలన — అతడు సామర్థ్యము గలవాడై నప్పుడే — సవ్యముగ నుండదు. ఆ యొక్క వ్యక్తియు ఇక స్త్రీలోలుడు, త్రాగుబోతు, విలాసప్రియుడు అయినచో వేరుగ చెప్పనక్కరయే లేదు. సంస్థాన ప్రజల ఓటు తీసికొనినచో, వారు సంస్థానములను బ్రిటిషు యిండియాలో కలుపుకొనుట సంతోష కర మని తెలుపుదురు. బ్రిటిషువారు దయ తలచుచుండుట చేతనే నేడు సంస్థానములు మనుచున్నవి.

"భారత సంస్థానములలో నున్న సాంకర్యము, మోసము, హింస, నిరంకుశత్వము మున్నగువానిలో సహస్రాంశమైనను బ్రిటీషు యిండియాలోనున్నచో బ్రిటీషురాజ్యము పూర్వమెన్న డో విధ్వంసమై యుండెడిది."

'ఆర్య' గ్రంథకర్తగారిహాం యస్. హాట్చిన్సన్, నాల్గవజడ్జి:

"సంస్థానప్రజలు తీవ్ర నిరంకుశ కృత్యములవలనను, దుస్సహమైన పన్నుల భారమువలనను బాధితు లగుచున్నారనుటలో నందియము లేదు. ఇట్టి పరిస్థితులను ఏ సార్వభౌమ ప్రభుతయు— అది తన బాధ్యతను గుర్తెరిగినదైన— క్షణలేశమైనను క్షమింపదు.

"ఫెడరల్ విధానముపట్ల సంస్థానాధిశుల ఆమోదమును పొందుటకుగాను వారి హద్దులేని నిరంకుశతను యథాతథముగ సాగనివ్వవలసి వచ్చిన, అసలు అట్టి ఆమోదముతో నిమిత్తము పెట్టుకొనకపోవుటయే ఉత్తమము. ఇట్లే భారత ప్రభుత్వ సుస్థిరత్వమునకుగాను సంస్థానాధీశుల క్రూరకృత్యములను సహింపక తప్పదేని, అట్టి సుస్థిరత్వమునకు పాకులాడక యుండుటయే మేలు.

"ఇదిగో దీని సంగతి ఇది అని వేలెత్తి చూపక, దాదాపుగ తక్కిన అన్ని సంస్థానములవలెనున్న ఒకానొక సంస్థానము సంగతిని ఇక్కడ పేర్కొందును. ఈ సంస్థానవు గత పరిపాలన నివేదిక —— ఇది 1930-31 సంవత్సరము నాటిది—— ఆ సంవత్సరములో సంస్థానమునకు 49 లక్షల రూపాయిల పై చిలుకు ఆదాయము వచ్చినట్లు తెలుపుచున్నది. ఈ మొత్తములో దివాణము క్రింద చెల్లిపోయిన డబ్బు దాదాపుగ 11,25,000 రూపాయలు. ఈ దివాణపు ఖర్చు విద్యాశాఖకును, వైద్య సహాయమునకును అయిన మొత్తమునకు మూడు రెట్లు. సంస్థానాధీశుని సుఖసంతృప్తులకొరకు ఖర్చుపడిన మొత్తమును

దివాణపు ఖర్చులో చేర్చక, వివిధ ప్రభుత్వశాఖలపైన ఖర్చులలో చేర్చుట సామాన్యముగ జరుగుతంత్రము. ఇట్టి తంత్రము— సంస్థానాధిపతి ఆశ్రితులకు పెద్దపెద్ద జీతములతో ఉద్యోగము లిచ్చుటకును, వారికి భవంతులను, మోటారుకార్లను సప్లయి చేయుటకును ఇట్టి తంత్రము చక్కగ ఉపయోగపడుచుండును— ఈ సందర్భములో జరుగలేదని అనుకొనినను సంస్థానాదాయములో దివాణము ఖర్చు నాల్గవవంతు అని నివేదికను బట్టియే స్పష్టపడుచున్నది బడ్జెటునందు వార్షికాదాయములో అధిక భాగము ప్రజలక్షేమము నిమిత్తము ప్రత్యేకింపబడినది" అని పైన చెప్పిన పరిపాలనా నివేదికలోనున్నది. సంస్థానములోని బాలబాలికలలో నాల్గవవంతుకే ఏదో ఒక రూపమైన విద్యా సౌకర్యములున్నవి. ఖర్చుతగ్గించుట అవసరమై సంస్థానాధిపతి పెన్షనులలో కోతపెట్టెనట. ఇదియును చాలనందున తక్కిన హోదాలోని ఉద్యోగస్థులను కొందరిని బర్తరఫ్ చేసెనట. ఇట్లు చేసిన ఈ సంవత్సరములోనే అతడు తన పందెపు గుర్రములశాఖలో క్రొత్తగా ఇద్దరు యూరపియన్ 'జాకీ'లను నియమించెను. ఈ 'జాకీ'లలో ఒక్కొక్కని జీతము సంస్థాన ముఖ్యపట్టణములలోని విద్యాలయ ప్రధానాచార్యుని వేతనమునకు మూడురెట్లు హెచ్చు!

"సంస్థానాధీశులు వ్యక్తిగతముగా చేయు ఈదుర్వ్యయమును భారత ప్రభుత్వమువారు చూచియు చూడనట్లు నటించెదరనుటకు ఎన్నియేని నిదర్శనము లున్నవి. ఇంతేకాదు. కొన్ని

కొన్ని సందర్భములలో భారత ప్రభుత్వమువారు సంస్థానాధిపతులను అనుకరించుటకు ప్రయత్నించెదరు !!"

కల్నల్ పోవెల్, అయిదవ జడ్జి:

ఏషియా నిరంకుశ ప్రభుత్వముల స్వరూపము ప్రస్తుతము భారతదేశ సంస్థానములలోనే కానవగును. మిరుమిట్లు గొలుపు ఆరాజ వ్యక్తులు, ఆ భూరి సంపదలు, ఆ యచింత్య వైభవములు, ఆ భోగవిలాసములు, ఆ యథేచ్ఛావ్యయములు, ఆ విచిత్ర సాంప్రదాయములు, ఆ మూఢాచారములు, ఆ దుర్భేద్య విశాల ప్రాసాదములు, ఆ యంతఃపుర యువతీసమూహములు, ఆ విలాస వారవనితా సందోహములు, పురుషుల యింద్రియతృప్తికే స్త్రీలు సృజింపబడిరను ఆ మూఢవిశ్వాసములు, మానవజీవితమునెడ ఆ నిరసనభావములు, ఆ భయంకర దండనములు, కాంచన రత్నాభరణ సంభృతము లగు ఆ ధనాగారములు, కవచధారులగు ఆ యాశ్వికులు, ఆ దాసదాసీజన పరివారములు, ఆ దివ్యసరోవరములు, ఆ కుసుమవాసితోద్యానములు, ఆ పురోహితబృందములు, ఆ విగ్రహసముదాయములు, ఆ మత్త మాతంగములు,—ఇ వన్నియు నేటికిని సంస్థానములందు ప్రత్యక్షమగుచున్నవి."

ఇంతమంది జడ్జీలు తీర్పుచెప్పిన పిదప, నేను ప్రత్యేకముగ వ్రాయదగినది వేఱెద్దియు నుండదుగదా !

## ఉపసంహారము

సంస్థానములలోని పరిస్థితు లింత అధ్వాన్నముగ నున్నను బ్రిటిషు ప్రభుత్వమువారు పట్టించుకొనుట లేదు. ఏ సందర్భము లందును బొత్తుగ పట్టించుకొనుట లేదని నే ననుట లేదు. పరిస్థితులు శ్రుతిమించి రాగమున బడినప్పుడు, గత్యంతరములేనప్పుడు జోక్యము కల్గించుకొనుచునేయున్నారు కాని, దీనివలన ఈషణ్మాత్రమైనను లాభము కలుగుట లేదు. ఈ విషయమై చూడ్డర్ ఏమి వ్రాయుచున్నాడో చూడుడు:

"తుట్టతుదకు బ్రిటిషు ప్రభుత్వమువారు జోక్యము కల్గించుకొన నిశ్చయించినచో, సంస్థానపతి విచారణ సంఘసమ్ముఖమున బడుటకు బదులు పదవిని త్యజించివైచును. అటుల చేయుడా, మఱి? తనపై నారోపింపబడిన నేరములను కాదనుటకు అతనికి సాధ్యమా? పైగా పదత్యాగము గావించుట అతని కొక విధమైన మేలేగాని, కీడు కాదు. ఇందుమూలమున పరిపాలనాభారము లేకుండగనే ధనము లభించును. ప్రజలయెడ గావించిన దుర్ణయములకు ప్రతిఫలముగా అతనికి చక్కని భృతియేర్పడును. దీనితో అతడు మిగిలినజీవితమును పారిస్ మున్నగు

నగరములలో విలాసముగ గడుపుచు, తన రాజకీవిని కాపాడి నందులకు బ్రిటిషు ప్రభుత్వమువారిని భూషించుచుండును.”

చూడ్గర్ వ్రాసిన వాక్యములు అక్షరశః సత్యములు. ఇందులకు నిదర్శనము తుకోజీరావు హోల్కారుగారే! బావలాహత్యతో వీరికి ఏదైన సంబంధము కలదో, లేదో నిర్ణయించుటకై విచారణసంఘమును నియమింపవలెనని బ్రిటిషుప్రభుత్వమువారు నిశ్చయించినంతనే, విచారణ కంగీకరింపక వీరు పదత్యాగము గావించిరి. ఇట్లు పదత్యాగము గావించుటవలన వీరికి ఏమైన నష్టము వాటిల్లినదా? లేదు. నాటినుండి నేటివఱకు సాలీనా కొన్ని లక్షల భృతి ముట్టుచున్నది. దానితో పూర్వభోగాతిశయములకు లోపము లేకుండగనే వీరు నిశ్చింతగ కాలము గడుపు చున్నారు.

అన్నట్లు చెప్పవచ్చినదేమన, సంస్థానాంతర్గత పరిపాలనలో— ఆ పరిపాలన సంపూర్తిగ దుర్భరము కానంతవఱకును బ్రిటిషు ప్రభుత్వమువా రేమియు జోక్యము కల్గించుకొనుటలేదు. ఇందులకు కారణ మేమి? సంస్థానాంతర్గత వ్యవహారములలో జోక్యము కల్గించుకొని సంస్థానాధిపులు ప్రజారంజకముగ పరి పాలింపవలెననుటకు బ్రిటిషు ప్రభుత్వమువారికి అధికారము లేదా? లే కేమి? ఉన్నది, పూర్తిగా! ఇందులకు లిట్టన్, సాలిస్బరీ, కర్జన్ ప్రభువులు భిన్న భిన్న సమయములలో జేసిన ప్రకటనలే నిదర్శనములు. పోనీ, బ్రిటిషు ప్రభుత్వము

వారు వివిధసంస్థానములతో విభిన్న సమయములలో గావించు కొన్న సంధులు మున్నగునవి అడ్డువడునా యన్న, అదియును లేదు. అసలు ప్రతిబంధకముల మాట యెట్లున్నను యావద్భారతదేశ శ్రేయోభివృద్ధికి సర్వబాధ్యత వహించితిమని అన్నప్పుడును, కానప్పుడును చెప్పుకొనుచుండు బ్రిటిషు ప్రభుత్వమువారు ఏడు కోట్ల సంస్థానప్రజల దిక్కుదెసలను ఆరయకుండుట యేటి న్యాయము?

కనుక ఎటు చూచినను భారత సంస్థానములలోని దుష్పరిపాలనను అరికట్టవలసిన బాధ్యత బ్రిటిషు ప్రభుత్వము వారిపై నున్నది కాని, వారు దీనిని నిర్వర్తించుట లే దేల? ప్రొఫెసరు హెరాల్డు లాస్కీ నుడివినట్లు 'భారత సంస్థానాధీశులు బ్రిటిషు ప్రభుత్వ సమర్థకులై యుండుట'యే దీనికి కారణమా? ఐనచో నింతకన్న అక్రమము, అన్యాయము, అధర్మము...

బ్రిటిషు ప్రభుత్వమువారికి సంస్థాన ప్రజల స్థితిగతులయెడగల నిర్లక్ష్యమును, ఆకాంక్షలయెడగల నిరసన భావమును నిరూపించుటకు నిదర్శనము వలయునేని రౌండుటేబులు సభాప్రతినిధ్య నిర్ణయమును పేర్కొనిన సరిపోవును. భారతభావిరాజ్యాంగ విధాన స్వరూపనిర్ధారణమున కనుచు జరుపబడిన మూడు రౌండుటేబులు సమావేశములలో ఒక్కదానికేని ముచ్చటగానైనను సంస్థాన ప్రజాప్రతినిధిని ఆహ్వానింపరైరి! కాని, సంస్థానాధిపులను మాత్రము కుప్పతిప్పలుగ పిలిచిరి!!

అసలు సంస్థాన ప్రజలను తృణీకరించుటయు, సంస్థానాధిపులను నత్తి కెక్కించుకొనుటయు బ్రిటిషు ప్రభుత్వమువారి నేటి రాజనీతి కాదుకదా! కానిచో, సంస్థాన ప్రజలు బ్రిటిషు యిండియాలోనైనను తమ కష్టనివృత్తికై ఆందోళన సలుపుటకు వీలు లేకుండునట్లు భారతసంస్థానాధీశుల రక్షణ చట్టము (Indian Princes Protection Act) చేయ నేల?

కాని, సంస్థాన ప్రజల నిట్లు మఱెంతకాలము నిర్లక్ష్యమొనర్ప గలరు? వారిలో నేడు రాజకీయ పరిజ్ఞానము వికాసించుచున్నది; స్వాతంత్ర్య ప్రేమ ప్రజ్వలించుచున్నది. సంఘీభావము స్థిరపడు సూచన లున్నవి. ఇట్టియెడ వారిని కలకాలము త్రొక్కిసిరాజనుట బ్రిటిషు ప్రభుత్వమువారికే యైనను మంచిదా? సంస్థానప్రజలు నేడు స్వల్ప సంస్కరణములను మాత్రమే కోరుచున్నారు. వారి కోర్కెను మన్నించినచో అశాంతి, అసంతృప్తి, ఆవేగము నమసి పోగలవు. లేనిచో గోటితో గిల్లివేయదగినదానిని గొడ్డలితో నరుకవలసివచ్చినట్లు జరుగవచ్చును. ఇట్టివి బ్రిటిషు ప్రభుత్వము వారికి అనుభవ వేద్యమైన విషయములే! సంస్థానేతర భారతీయులు పెక్కు వత్సరముల తరబడి కోరిన అధినివేశ స్వాతంత్ర్యమును నిరాకరించుట వలననేగదా తరుణభారత నాయకులు నేడు బ్రిటిషు సామ్రాజ్యముతో సంబంధమును నడలించుకొనినగాని భారతదేశము తరింపజాలదనుట.

## స్వదేశసంస్థానాలు

సంస్థానాధిపులు సయితము కాలగతిని గుర్తించుట శ్రేయస్కరము. సామ్య, సాంఘికవాదములు ప్రబలుచున్న దినములివి. ఇట్టియెడ ప్రజాభీష్టమునకు విరుద్ధముగ -- నిరంకుశముగ — పరిపాలించుట శ్రేయోదాయకమా ?

సంస్థాన ప్రజలైనను, సంస్థానేతరులైనను నేడు భారతీయులకందరికి ఒక్కటే ధ్యేయము; అది స్వపరిపాలన. ఒక్కటేపద్ధతి; అది శాంతిపద్ధతి. ఒక్కటే పరీక్ష; అది అగ్నిపరీక్ష. ఈవిషయమును బ్రిటిషు ప్రభుత్వమువారును, భారతసంస్థానపతులును సుముఖులై గుర్తింపగలిగినచో దోహద మొనర్చినవా రగుదురు. భారతజాతీయాశయసిద్ధికిని, భారతావని కల్యాణమునకును లేనిచో...

# సంస్థానాలు: కాంగ్రెసు

అఖిలభారత సంస్థాన ప్రజామండలి అధ్యక్షులైన డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారు "సంస్థానాలు: ఫెడరేషన్" అనే శీర్షికకింద ఈ పుస్తకానికి పీఠిక వ్రాసింది 1938 జూన్ రెండవ వారంలో. ఇక, నేను "సంస్థానాలు: కాంగ్రెసు" అనే ఈ అనుబంధాన్ని కలుపుతున్నది నవంబర్ రెండవ వారంలో. ఈ అయిదుమాసాల వ్యవధిలో సంస్థానాల సమస్య అతిభయానక రూపాన్ని ధరించింది.

ఇంత స్వల్పకాలంలో ఈ సమస్య ఇంతగా వికటించడానికి గల కారణం, మైసూరును అనుసరించి తిరువాన్కూరు, హైదరాబాదు, రాజకోట, ఢెంకనాలు మొదలైన అనేక సంస్థానాలు స్థానిక కాంగ్రెసు సంస్థలమీద యుద్ధాన్ని ప్రకటించడమే! ఇలా యుద్ధాన్ని ప్రకటించి ఇవి మైసూరుకంటెకూడా ఘోరాతిఘోరమైన దౌర్జన్యాలకు దిగినవి. మైసూరులో ఒకటి, రెండుసార్లు మాత్రమే పోలీసులు ప్రజలమీద తుపా

తల్ని కాల్చితే, తిరువాన్కూరులో ఈ దారుణ కృత్యాన్ని అయిదారుసార్లు జరిగించారు. తిరువాన్కూరు సంస్థానం ఏర్పడి వున్న స్థానిక కాంగ్రెసు సంస్థను బహిష్కరిస్తే, హైదరాబాదు ఇంకా ఏర్పడ నైనా ఏర్పడనట్టి కాంగ్రెసు సంస్థపై ఆంక్షను ప్రకటించింది. ఈ విధంగా ఒక సంస్థానంతో మరొకటి నిరంకుశ విధానంలో పోటీపడుతున్నది.

ఇటీవల వివిధ సంస్థానాలలో జరిగిన రాక్షసకృత్యాలను వర్ణించాలంటే, ఒక పెద్ద గ్రంథం అవుతుంది. అందుచేత ఆపనికి పూనుకోకుండా, న్యాయపరిపాలనకు ఇంతకు పూర్వం కొంత కీర్తిని గడించుకున్న తిరువాన్కూరు సంస్థానంలో జరిగిన విషయాలను మాత్రం సంగ్రహంగా ఉదాహరిస్తాను. వీటినిబట్టి తిరువాన్కూరుకంటె అన్నివిధాల వెనకబడివున్న ఇతరసంస్థానాలలోని పరిస్థితులు ఎంత భయానకంగా వున్నవో ఎవరికి వారే ఊహించుకోవచ్చును

తిరువాన్కూరు సంస్థానకాంగ్రెసు నాయకులలో ఒకరయిన మెస్కరీన్ కన్యా తమ సంస్థానంలో జరిగిన ఘాతుక కృత్యాల్ని గురించి ఒకప్రకటన చేసింది. ఆప్రకటనలోని కొన్ని భాగాలు ఇవి:

“తిరువాన్కూరు మహారాజుగారి ఆధిపత్యంకింద బాధ్యతాయుత పరిపాలన కావాలని సంస్థానకాంగ్రెసుసంఘం కోరడం వల్ల, సంస్థానం కేవలం నరకరూపంగా తయారైంది. ఇందుకు దివాను అయినట్టి సర్ సి. పి. రామస్వామిఅయ్యర్ బాధ్యుడు.

"త్రివేండ్రం పట్టణంలోని ప్రజల ప్రాణమాన విత్తాలకు నేడు ఎట్టి రక్షణ లేదు. ప్రజలదుస్థితి చెప్పడానికి అలవికాకుండావుంది. సంస్థానకాంగ్రెసు సంయుక్త కార్యదర్శి నీలకంఠ పిళ్ళెగారిని నడివీధిలో పట్టపగలు చావమోదారు. వారికి తలమీద, మణికట్టుపైన బలమైనగాయాలు తగిలాయి; రక్తం కాల్వకట్టింది. ఇంతేకాదు గౌరవనీయులైన ఇద్దరు పత్రికాధిపతుల్ని నడివీధిలో అవమానించారు. పోలీసువారి ఎదటనే రౌడీలు ఈ దుండగాల్ని చేశారు. వారివల్ల సంస్థాన కాంగ్రెసువారికి ఎట్టి సభలు జరుపడానికీ శక్యం కాకుండా వున్నది.

"ఇక, పోలీసువారు స్వయంగా చేస్తున్న దౌర్జన్యాలకు మితిలేదు. నిర్దోషులైన పసికూనలమీద, నీళ్ళు చేదుకుంటూవున్న ముసలి ఆడవాళ్ళమీద, చివరికి చెట్లనీడలో పెట్టిన బైసికిలుల మీద పోలీసులు లాఠీప్రయోగం చేశారు. అచేతనాలైన బైసికిల్సుమీద కూడా వారు లాఠీప్రయోగం చేశారంటే, వారి ఉన్మాదస్థితి ఎంతవరకు వెళ్ళిందో వేరే చెప్పాలా?

"పోలీసువాళ్ళు ఏమిచేసినా, స్వాతంత్ర్యంమీద వుండే ప్రేమచేత ప్రజలు తమ ఉద్యమాన్ని విరమించకంలేదు. సంస్థాన కాంగ్రెసువారు పెద్దపెద్ద పట్టణాలలోనే గాక, చిన్నచిన్న పల్లెలలోకూడ సభలను జరుపుతున్నారు. ఈ సభలలో వేలకు వేలు జనం పాల్గొంటున్నారు. ఈ జనంమీద పోలీసువారు

కాల్పులు ప్రారంభించారు. అనేక ప్రదేశాలలో కాల్పులవల్ల ప్రజలు నల్లులు మాడినట్లు మాడిపోయారు. నిరాయుధులు నిర్దోషులు అయినవారు అనేకులు చనిపోయారు; ఎందరో గాయపడ్డారు.

“నెయ్యాత్తింకారా అనే ప్రదేశంలో రాఘవన్ అనే వీరుడు పోలీసు గుండుదెబ్బలకు తన ఛాతీని అప్పగించి, మరణిస్తూ కూడా “సంస్థానకాంగ్రెసుకు జై” అనే విజయధ్వానాన్ని చేశాడు.

“ఈ కాల్పులసందర్భంలో జరిగిన కొన్ని ఘోరాలు ఇవి: బజారువెంట పోతూవున్న గర్భిణీస్త్రీని కాల్చటం—ఆమెకు పుట్టబోయే బిడ్డకూడా ఎదురు తిరుగుతాడేమో అని పోలీసు వారి భయం కాబోలు!

“చెంగనూరులో ఒక విద్యార్థి కాల్పులవల్ల మరణిస్తూ ‘దాహం! దాహం!!’ అని ఆక్రోశిస్తే, పక్కనేవున్న మిలటరీవారు తమవి గుండెలుకాదు—నల్లరాళ్ళుఅని ప్రజలకు తెలియజెయ్యడానికో అన్నట్లు, ఆ బాలుడిని బూటుకాలితో మూడుమతన్నులు తన్ని, వున్న కొనవూపిరికాస్తా పోగొట్టారు.

“దక్షిణాఫ్రికానుంచి వచ్చిన యన్. యస్. పిళ్ళైగారు సంస్థాన కాంగ్రెసు ఉద్యమంలో చేరారు పోలీసువారు వారిని కూడా అరెస్టుచేశారు. అరెస్టు అయినప్పుడు డాక్టర్‌గారు స్వస్థులుగానే వున్నారు. కాని కొన్నిగంటలలోనే వారిస్థి